# పాఠకులకు ముఖ్య గమనిక

పంచాంగరచన బహుక్లిష్టమైనది. కత్తిమీద సాములాంటిది. గురుపరంపరానుగతంగా నాకు సంప్రాప్తించిన జ్ఞానాన్ని కఠోరమైన సాధనతో సానపెట్టుకుంటూ, ప్రాచీనగ్రంథ భాండాగారాన్ని మథిస్తూ ఈ పంచాంగరచన చేస్తున్నాను.

వీలైనంతవరకు ఈ పంచాంగమును ఈషన్మాత్ర దోష రహితంగా ప్రపంచానికి అందించాలనేదే నా ప్రయత్నం. ముద్రణకు ముందుగా అక్షర కూర్పులు చేయాలి. మానవమాత్రులం గనుక కొండగచో ఏదేనీ అక్షరదోషం వాటిల్లితే క్షంతవ్యుడిని. తామరతంపరగా పంచాంగకర్తలు పుట్టుకరావటం, పుంఖాను పుంఖాలుగా పంచాంగాలు ప్రజాబాహుళ్యంలోకి వస్తూండటం, పంచాంగకర్తలు స్వీయమనుగడ కోసం పరస్పర నిందారోపణలు చేసుకుంటూ వీధుల పడటం వలన నిజమైన పండితులు సైతం ప్రజల నుండి అవమానాలు, అవహేళనలు ఎదుర్కోవటం జరుగుతున్నది.

జ్యోతిషము కూడా ఒక శాస్త్రము... సైన్స్.

ఎంతగొప్పగా సాధన చేశామన్న అంశంపైనే పంచాంగపు నిక్కచ్చితనం ఆధారపడి ఉంటుంది. సైన్స్‌లో ఒక అంశాన్ని కనుక్కొన్ని తెరమీదకి తెస్తే... అదే అంశానికి సంబంధించి విరుద్ధమైన అంశం కొన్నాళ్ల తరువాత ప్రతిపాదితమవుతుంది.

అలాగే ఏ శాస్త్రమైనా అంతే. శాస్త్రాన్ని నమ్మనివారు పంచాంగాన్ని చూడనవసరం లేదు. దైవాన్ని, వేదశాస్త్ర పురాణాల్ని, వైదిక ధర్మాన్ని నమ్మినవారు మాత్రమే పంచాంగం చూడాలి. ఇటువంటి వారి కోసమే ఈ పంచాంగం తప్ప, నిరీశ్వర వితండవాదం చేసే పండిత శ్రేష్ఠుల కోసం కాదని నా మనవి.

ఇట్లు,
భవదీయుడు
పొన్నలూరి శ్రీనివాస గార్గేయ,
పంచాంగకర్త

# కాలయోగం

## పంచాంగ విశిష్ఠత

ఈ పంచాంగము దుక్సంస్కారయుతమై దృక్సిద్ధాంత అయనాంశలతో గణించబడినది. ఇందలి గ్రహస్థితులు, తిథి నక్షత్ర సమయములన్నియు శాస్త్ర ప్రమాణమునకు, ప్రత్యక్షదర్శనమునకు ఖచ్చితంగా సరిపోవును. ఆంధ్రప్రదేశ్, తెలంగాణ రాష్ట్రములకు మధ్యగల విజయవాడ పట్టణమునకు (16.32 ఉత్తర అక్షాంశము, 80.32 తూర్పు రేఖాంశము) సంస్కరించబడినది. ఈ పంచాంగంలో ఇచ్చిన నిత్య గ్రహస్ఫుటాలు ఉదయం 5గంటల 30నిముషములకని గమనించాలి.

తిథి నక్షత్ర యోగ కరణములకు అంత్య సమయాలను, వర్జ్య దుర్ముహూర్త అమృత సమయాలకు ప్రారంభాంత్య సమయాలతో పాటు, నిత్యం సూర్యోదయ, చంద్రోదయాలు, నక్షత్ర పాద ప్రారంభ సమయాలు, పితృతిథి నిర్ణయాలు, రాహుకాల సమయాలు, మాస వారీగా అభిజిత్ నక్షత్ర ప్రారంభ అంత్య సమయాలతో పాటు, ప్రతి 5రోజులకు ఒకమారు బ్రాహ్మీముహూర్తం, ప్రాతఃసంధ్య, గోధూళి, సాయంసంధ్యా సమయాలను ఇవ్వడమైనది. సందిగ్ధ పర్వదినాలకు ధర్మశాస్త్ర నిర్ణయాలను తెలియజేస్తూ, దృగ్గణిత ప్రకారంగా తేదీల నిర్ణయం ఇవ్వడమైనది. సుముహూర్తాలతోపాటు, పండుగ పర్వదినాలలో పూజా సమయాలు ఇవ్వడమైనది. బాలారిష్ట దోషాలు, నక్షత్రపాద దోషాలు లేని సిజేరియన్ ఆపరేషన్లకు సమయాలను ఇచ్చిననూ, వైద్యులదే తుది నిర్ణయమని భావించాలి. న్యూయార్క్ పంచాంగము, శుభ సమయాలు, పర్వదినాలు ఇవ్వటమైనది.

తెలంగాణ, ఆంధ్రప్రదేశ్‌లలోని ఇతర జిల్లాలు, చెన్నై, బెంగళూరు, మైసూరు నగరాల వారు ఈ పంచాంగమందిచ్చిన దేశాంతర సంస్కార పట్టిక ప్రకారం సుముహూర్తములను సంస్కరించుకొనేది.

**దైవజ్ఞ పొన్నలూరి శ్రీనివాస గార్గేయ**

**భారత ప్రభుత్వ ఆమోదగణిత పంచాంగకర్త**



## శ్రీ శుభకృత్ - ముఖ్య గ్రహస్థితులు

1. కాలసర్పయోగంలోనే శ్రీ శుభకృత్ ఉగాది పురుడు పోసుకోనుంది
2. రవి, కుజ గ్రహాలకు శ్రీ శుభకృత్‌లో ఎలాంటి ఆధిపత్యాలు రాలేదు.
3. 354 రోజులు సాగే శ్రీ శుభకృత్‌లో రాజు శని 347 రోజులు శతృగ్రహ నక్షత్రమైన ధనిష్ఠలోనే సంచారం
4. ఏప్రిల్ 4 మకరరాశిలో 28వ డిగ్రీలో శని, కుజుల సంఘర్షణ
5. ఏప్రిల్ 12 రాహువు మేషరాశిలోకి, కేతువు వృశ్చికరాశిలోకి ప్రవేశం
6. ఏప్రిల్ 13 వామనద్వాదశిన గురువు స్వక్షేత్రమైన మీనరాశిలోకి ప్రవేశం
7. ఏప్రిల్ 29 నుంచి జూలై 12 వరకు 75 రోజులు శని అతిచార నడక
8. చైత్ర అమావాస్య 30 ఏప్రిల్ 2022 మేషరాశిలో రాహుగ్రస్త పాక్షిక సూర్యగ్రహణం జరుగును. ఇది భారత్‌లో కనపడదు
9. వైశాఖ పూర్ణిమ 16 మే 2022 తులారాశిలో కేతుగ్రస్త సంపూర్ణ చంద్రగ్రహణం గోచరించును. ఇది కూడా భారత్‌లో కనపడదు.
10. మే 24 నుంచి జూన్ 17 వరకు మేషంలో శుక్ర రాహువుల కలయిక
11. జూన్ 27 నుంచి ఆగస్టు 10 వరకు మేషంలో కుజ, రాహు కలయిక
12. ఆశ్వీజ అమావాస్యకు 25 అక్టోబరు 2022 తులారాశి స్వాతిలో పాక్షిక సూర్యగ్రహణం. భారత్‌లో కేవలం ముగింపు మాత్రమే కనపడును.
13. కార్తిక పూర్ణిమకు 8 నవంబరు 2022 మేషరాశి భరణిలో సంపూర్ణ చంద్రగ్రహణం. భారత్‌లో పాక్షికంగా ముగింపు మాత్రమే కనపడును.
14. ఈ డిశంబరు 4 నుంచి 2023 ఫిబ్రవరి 24 వరకు రోహిణిలో కుజగ్రహ వక్ర సంచారం ప్రపంచారిష్ట యోగం.
15. రాబోయే 2023 జనవరి 17 నుంచి మీనరాశికి ఏలినాటి శని, కర్కాటక రాశికి అష్టమ శని, వృశ్చిక రాశికి అర్ధాష్టమ శని ప్రారంభం

దైవజ్ఞ పొన్నలూరి శ్రీనివాస గార్గేయ

## ఆదివారం - సూర్య కవచము

రవి శ్లో॥ జపాకుసుమ సంకాశం కాశ్యపేయం మహోద్యుతిం।
తమోరిం సర్వపాపఘ్నుం ప్రణతోస్మి దివాకరం॥

ఘృణిః పాతు శిరోదేశం, సూర్యః ఫాలం చ పాతు మే
ఆదిత్యో లోచనే పాతు శ్రుతీ పాతః ప్రభాకరః
ఘ్రూణం పాతు సదా భానుః అర్క పాతు తథా
జిహ్వాం పాతు జగన్నాధః కంఠం పాతు విభావసు
స్కంధౌ గ్రహపతిః పాతు, భుజౌ పాతు ప్రభాకరః
అహస్కరః పాతు హస్తౌ హృదయం పాతు భానుమాన్
మధ్యం చ పాతు సప్తాశ్వో, నాభిం పాతు నభోమణిః
ద్వాదశాత్మా కటిం పాతు సవితా పాతు సక్థినీ
ఊరూ పాతు సురశ్రేష్టో, జానునీ పాతు భాస్కరః
జంఘే పాతు చ మార్తాండో గుల్ఫౌ పాతు త్విషాంపతిః
పాదౌ బ్రధ్నః సదా పాతు, మిత్రో పి సకలం వపుః
వేదత్రయాత్మక స్వామిన్ నారాయణ జగత్పతే

## సోమవారం - చంద్రకవచము

చంద్ర శ్లో॥ దధిశంఖ తుషారాభం క్షీరార్ణవ సముద్భవం ।
నమామి శశినం సోమం శంభోర్మకుట భూషణం॥

శశీ పాతు శిరోదేశం భాలం పాతు కలానిధిః।
చక్షుషీ చంద్రమాః పాతు శ్రుతీ పాతు నిశాపతిః ॥
ప్రాణం క్షపకరః పాతు ముఖం కుముదబాంధవః।
పాతు కంఠం చ మే సోమః స్కంధే జైవాతృకస్తథా॥
కరౌ సుధాకరః పాతు వక్షః పాతు నిశాకరః ।
హృదయం పాతు మే చంద్రో నాభిం శంకరభూషణః॥
మధ్యం పాతు సురశ్రేష్ఠః కటిం పాతు సుధాకరః।
ఊరూ తారాపతిః పాతు మృగాంకో జానునీ సదా ॥
అబ్ధిజః పాతు మే జంఘే పాతు పాదౌ విధుః సదా।
సర్వాణ్యన్యాని చాంగాని పాతు చంద్రోఖిలం వపుః॥



## మంగళవారం - కుజ కవచము

కుజ శ్లో॥ ధరణీ గర్భసంభూతం విద్యుత్కాంతి సమప్రభం ।
కుమారం శక్తి హస్తం చ మంగళం ప్రణమామ్యహం ॥

అంగారకః శిరో రక్షేత్ ముఖం వై ధరణీసుతః ।
శ్రవౌ రక్తంబరః పాతు నేత్రే మే రక్తలోచనః ॥

నాసాం శక్తిధరః పాతు ముఖం మే రక్తలోచనః ।
భుజౌ మే రక్తమాలీ చ హస్తౌ శక్తిధరస్తథా॥

వక్షః పాతు వరాంగశ్చ హృదయం పాతు రోహితః।
కటిం మే గ్రహరాజశ్చ ముఖం చైవ ధరాసుతః॥

జానుజంఘే కుజః పాతు పాదౌ భక్తప్రియః సదా।
సర్వాణ్యన్యాని చాంగాని రక్షేన్మే మేషవాహనః॥

## బుధవారం - బుధ కవచము

బుధ శ్లో॥ ప్రియంగు కలికాశ్యామం రూపేణాప్రతిమం బుధం ।
సౌమ్యం సౌమ్యగుణోపేతం తం బుధం ప్రణమామ్యహం ॥
బుధస్తు పుస్తకధరః కుంకుమస్య సమద్యుతిః।
పీతాంబరధరః పాతు పీతమాల్యానులేపనః॥

కటిం చ పాతు మే సౌమ్యః శిరోదేశం బుధస్తథా।
నేత్రే జ్ఞానమయః పాతు శ్రోత్రే పాతు నిశాప్రియః॥

ఘ్రూణం గంధప్రియః పాతు జిహ్వాం విద్యాప్రదో మమ।
కంఠం పాతు విధోః పుత్రో భుజౌ పుస్తకభూషణః॥

వక్షః పాతు వరాంగశ్చ హృదయం రోహిణీసుతః।
నాభిం పాతు సురారాధ్యో మధ్యం పాతు ఖగేశ్వరః॥

జానునీ రౌహిణేయశ్చ పాతు జంఘేఖిలప్రదః ।
పాదౌ మే బోధనః పాతు పాతు సౌమ్యోఖిలం వపుః ॥

## గురువారం - గురు కవచము

గురు శ్లో॥ దేవానాంచ ఋషీణాంచ గురుం కాంచన సన్నిభం ।
బుద్ధిమంతం త్రిలోకేశం తం నమామి బృహస్పతిం ॥

బృహస్పతిః శిరః పాతు లలాటం పాతు మే గురుః।
కర్ణౌ సురగురుః పాతు నేత్రే మేభీష్టదాయకః॥

జిహ్వాం పాతు సురాచార్యః నాసం మే వేదపారగః।
ముఖం మే పాతు సర్వజ్ఞః కంఠం మే దేవతాగురుః॥

భుజా వంగీరసః పాతు కరౌ పాతు శుభప్రదః।
స్తనౌ మే పాతు వాగీశః కుక్షిం మే శుభలక్షణః॥

నాభిం దేవగురుః పాతు మధ్యం పాతు సుఖప్రదః।
కటిం పాతు జగద్వంద్యః ఊరూ మే పాతు వాక్పతిః॥

జానుజంఘే సురాచార్యః పాదౌ విశ్వాత్మకః సదా।
అన్యాని యాని దాంగాని రక్షేన్మే సర్వతో గురుః॥

## శుక్రవారం - శుక్ర కవచము

శుక్ర శ్లో॥ హిమకుండ మృణాళాభం దైత్యానం పరమం గురుం ।
సర్వశాస్త్ర ప్రవక్తారం భార్గవం ప్రణమామ్యహం ॥

శిరో మే భార్గవః పాతు భాలం పాతు గ్రహాధిపః।
నేత్రే దైత్యగురుః పాతు శ్రోత్రే మే చందనద్యుతిః॥

పాతు మే నాసికాం కావ్యో వదనం దైత్యవందితః।
వచనం చోశనాః పాతు కంఠం శ్రీకంఠభక్తిమాన్॥

భుజౌ తేజోనిధిః పాతు కుక్షిం పాతు మనోవ్రజః।
నాభిం భృగుసుతః పాతు మధ్యం పాతు మహీప్రియః॥

కటిం మే పాతు విశ్వాత్మా ఊరూ మే సురపూజితః।
జానుం జాడ్యహరః పాతు జంఘే జ్ఞానవతాం వరః॥

గుల్ఫౌ గుణనిధిః పాతు పాతు పాదౌ వరాంబరః।
సర్వాణ్యంగాని మే పాతు స్వర్ణమాలాపరిష్కృతః॥

## శనివారం - శని కవచము

శని శ్లో॥ నీలాంజన సమాభాసం రవిపుత్రం యమాగ్రజం ।
ఛాయామార్తాండ సంభూతం తం నమామి శనైశ్చరం ॥

ఓం శ్రీ శనైశ్చరః పాతు భాలం మే సూర్యనందనః।
నేత్రే ఛాయాత్మజః పాతు పాతు కర్ణౌ యమానుజః॥

నాసాం వైవస్వతః పాతు ముఖం మే భాస్కరః సదా।
స్నిగ్ధకంఠశ్చ మే కంఠం భుజౌ పాతు మహాభుజః॥



స్కంధౌ పాతు శనిశ్చైవ కరౌ పాతు శుభప్రదః।
వక్షః పాతు యమభ్రాతా కుక్షిం పాత్వసితస్తథా॥

నాభిం గ్రహపతిః పాతు మందః పాతు కటిం తథా।
ఊరూ మమాంతకః పాతు యమో జానుయుగం తథా॥

పాదౌ మందగతిః పాతు సర్వాంగం పాతు పిప్పలః।
అంగోపాంగాని సర్వాణి రక్షేన్ మే సూర్యనందనః॥

## శనివారం - రాహు కవచము

రాహు శ్లో॥ అర్ధకాయం మహావీర్యం చంద్రాదిత్య విమర్ధనం ।
సింహికా గర్భ సంభూతం తం రాహుం ప్రణమామ్యహం॥

నీలాంబరః శిరః పాతు లలాటం లోకవందితః।
చక్షుషీ పాతు మే రాహుః శ్రోత్రే త్వర్ధశరిరవాన్॥

నాసికాం మే ధూమ్రవర్ణః శూలపాణిర్ముఖం మమ।
జిహ్వాం మే సింహికాసూనుః కంఠం మే కఠినాంఘ్రికః॥

భుజంగేశో భుజౌ పాతు నీలమాల్యాంబరః కరౌ।
పాతు వక్షఃస్థలం మంత్రీ పాతు కుక్షిం విధుంతుదః॥

కటిం మే వికటః పాతు ఊరూ మే సురపూజితః।
స్వర్భానుర్జానునీ పాతు జంఘే మే పాతు జాడ్యహా॥

గుల్ఫౌ గ్రహపతిః పాతు పాదౌ మే భీషణాకృతిః।
సర్వాణ్యంగాని మే పాతు నీలచందనభూషణః॥

## మంగళవారం - కేతు కవచము

కేతు శ్లో॥ ఫలాశ పుష్ప సంకాశం తారకాగ్రహమస్తకం ।
రౌద్రం రౌద్రాత్మకం ఘోరం తం కేతుం ప్రణమామ్యహం ॥

చిత్రవర్ణః శిరః పాతు భాలం ధూమ్రసమద్యుతిః।
పాతు నేత్రే పింగలాక్షః శ్రుతీ మే రక్తలోచనః॥

ఘ్రాణం పాతు సువర్ణాభశ్చిబుకం సింహికాసుతః।
పాతు కంఠం చ మే కేతుః స్కంధౌ పాతు గ్రహాధిపః॥

హస్తౌ పాతు సురశ్రేష్ఠః కుక్షిం పాతు మహాగ్రహః।
సింహాసనః కటిం పాతు మధ్యం పాతు మహాసురః॥

ఊరూ పాతు మహాశీర్షో జానునీ మేతికోపనః।
పాతు పాదౌ చ మే క్రూరః సర్వాంగం నరపింగలః॥

## ధర్మశాస్త్రాలు - పర్వదిన నిర్ణయాలు

## శ్రీ కృష్ణాష్టమి - శ్రీ కృష్ణ జయంతి

శ్రావణమాసంలో బహుళ అష్టమి తిథి అర్ధరాత్రి వ్యాప్తి ఉన్న రోజునే స్మార్త, మాధ్వులు శ్రీకృష్ణాష్టమిని ఆచరిస్తారు. ఈ నేపథ్యంలో శ్రీ శుభకృత్ 2022 ఆగస్టు 18 గురువారం శ్రావణ బహుళ అష్టమి తిథి అర్ధరాత్రి వ్యాప్తిలో ఉన్నందున స్మార్తులు మాధ్వులు ఆచరిస్తారు. కానీ వైష్ణవ సాంప్రదాయంలో శ్రీకృష్ణజయంతి నిర్ణయానికి నియమాలు వేరుగా ఉండును.

**శ్రీకృష్ణజయంతి నిర్ణయం :** అథ వైష్ణవశ్రీకృష్ణజయన్తీనిర్ణయః

సింహేర్కే రోహిణీయుక్తా నభః కృష్ణాష్టమీ యది।
రాత్ర్యర్ధపూర్వాపరగా జయన్తీ కలయాపి చ॥
శ్రావణస్య సితాష్టమ్యాం పఞ్చాస్యే న చేద్రవిః।
తదా భాద్రపదే కుర్యాజ్జయన్తీ రోహిణీయుతా।
యస్మిన్ వర్షే జయంత్యాఖ్యో యోగో యది న లభ్యతే।
జన్మాష్టమ్యేవ విద్వద్భిస్తయా కార్యా మహాఫలా॥...

సప్తమీవిద్ధాష్టమ్యాం శుద్ధాయా రోహిణ్యాస్సద్భావేపి సా పరిత్యాజ్యా।
శుద్ధాష్టమ్యాం వహ్నివిద్ధాయా రోహిణ్యాస్సద్భావే సాపి న జయన్తీ।
కిన్తు సప్తమీసమ్పర్కరహితాయామష్టమ్యాం కృత్తికాసమ్పర్కరహితాయా
రోహిణివ్యస్సద్భావే జయన్తీతి వైష్ణవానాం రాద్ధాన్తః॥

అష్టమ్యాం వా నవమ్యాం వా దశమ్యాం యది రోహిణితీ।
సా జయన్తీతి విఖ్యాతా విష్ణువ్రతపరాయణైః।

పై శ్లోకాన్ని పరిశీలించిన పిదప, శ్రీకృష్ణజయంతి పర్వదినానికి నియమాలు ఏమంటే...

1. రవి సింహరాశిలో ఉండి తీరాలి
2. సప్తమితో కూడిన అష్టమి యందు రోహిణి ఉన్ననూ వీలు లేదు.
3. అలాగే కృత్తిక కలిసిన రోహిణి ఉన్ననూ జయంతికి పనికిరాదు.
4. సూర్యోదయం నుంచే రోహిణి నక్షత్రం ఉండితీరాలి
5. సప్తమి తిథి కలవని అష్టమి, లేదా కృత్తికతో కలవని రోహిణి ఉంటేనే శ్రీ కృష్ణజయంతి.
6. అష్టమి లేకున్నా నవమైననూ, దశమైననూ రోహిణి ఉంటేనే జయంతి అంటారు.
6. శ్రావణం కాకున్నా భాద్రపద బహుళంలోనైనా ఆచరిస్తారు. ఇది వారి సంప్రదాయం.

పైన చెప్పిన నియమాల ప్రకారంగా వైష్ణవ సాంప్రదాయం ప్రకారం శ్రీకృష్ణజయంతి పర్వదినాన్ని 2022 ఆగస్టు 20 శనివారం రోజున జరుపుకొనుటకు అభ్యంతరముండదు.

## సరస్వతీదేవి ఆవాహనం - ఉద్వాసనం

**మూలేషు స్థాపనం దేవ్యా పూర్వాషాఢా సుపూజనం।**
**ఉత్తరాసు బలిందద్యాత్ శ్రవణేన విసర్జయేత్॥ - ధర్మసింధు**
**మూలాదౌ పూజనం దేవ్యాశ్శ్రవణాదౌ విసర్జనమ్।**
**తావుభౌ నిశి చేత్ స్యాతాముభే ప్రాతః పరేహ్ని॥ - బ్రహ్మాండపురాణం**



మూల నక్షత్ర ప్రథమపాదంలో సరస్వతీ దేవిని ఆవాహనం చేసి, పూర్వాషాఢ నక్షత్రంలో విశిష్ట పూజలు గావించి, శ్రవణానక్షత్ర తొలి పాదమందు సరస్వతీ దేవిని విసర్జించాలి. మూల, శ్రవణా నక్షత్రాల తొలి పాదములు రాత్రి సమయాలలో వచ్చినచో, మరునాటి ప్రాతఃకాలములలో పూజించాలి. ప్రామాణిక దృగ్గణిత ప్రకారంగా 2022 అక్టోబరు 2 ఆదివారం ఉదయం 8.53 వరకు మూల నక్షత్ర మొదటిపాదమున్నది.

**2 అక్టోబరు ఆదివారమే సరస్వతీదేవిని ఆవాహనం చేయాలి.**
**3 అక్టోబరు సోమవారం పూర్వాషాఢలో సరస్వతీదేవికి విశేష పూజలాచరించాలి.**
**శ్రవణం ప్రథమ పాదము 4 మంగళవారం రాత్రి సమయంలో ఉన్నందున మరునాడు 5 అక్టోబరు బుధవారం సరస్వతీదేవ్యుద్వాసనము గావించాలి.**

## కార్తికమాసం - వ్రత నిర్ణయములు

### క్షీరాబ్ది ద్వాదశి నిర్ణయము - నవంబరు 4

ద్వాదశ్యాం కార్తికే శుక్లే హరిం క్షీరాబ్దిశాయినమ్।
పూజయేత్ తులసీమూలే ప్రదోషే మునిపుఙ్గవ॥ - విష్ణుపురాణం

తా॥ కార్తికశుద్ధ ద్వాదశిన ప్రదోషంలో క్షీరాబ్దిశయనుడగు శ్రీహరిని తులసీచెట్టు మొదలి యందు పూజించవలెనని విష్ణుపురాణము తెల్పినది. 2022 నవంబరు 4 శుక్రవారం ప్రదోషంలో ద్వాదశితిథి వ్యాప్తి ఉన్నది.కనుక పైనిర్ణయానుసారం నవంబరు 4 క్షీరాబ్దిద్వాదశి.

### చుల్క వ్రత నిర్ణయము - నవంబరు 5

ఊర్జే శుక్లే మునిశ్రేష్ఠ ద్వాదశ్యాముదయే రవేః।
చుల్కవ్రతం ప్రకర్తవ్యం సుతసౌభాగ్యవృద్ధయే॥ - స్మృతి చంద్రిక

తా॥ కార్తిక శుక్ల ద్వాదశిన చుల్కవ్రతము. దీనినే చుల్కద్వాదశి అంటారు. ద్వాదశి ఉదయ వ్యాప్తినే గ్రహించాలి. సంతాన సౌభాగ్యానికై చుల్కవ్రతం ఆచరించాలని స్మృతిచంద్రిక తెల్పినది. నవంబరు 5 శనివారం కార్తిక శు.ద్వాదశి తిథి ఉదయవ్యాప్తిలో ఉన్నందున సంతాన సౌభాగ్యవృద్ధి కొరకు చుల్కవ్రతం ఆచరించవలెను.

**గమనిక- క్షీరాబ్ది ద్వాదశి, చుల్కద్వాదశి తిథి వ్యాప్తిలో వ్యత్యాసాలు ఉన్నవి. ఒక్కోసారి రెండూను ఒకేరోజు రావచ్చు, లేదా రెండురోజులలో రావచ్చు. పాఠకులు రెండింటికీ తిథి వ్యాప్తిలో ఉన్న వ్యత్యాసాన్ని గమనించగలరు.**

### కార్తిక పూర్ణిమ (త్రిపురోత్సవ నిర్ణయము - నవంబరు 7)

**శ్రీ శుభకృత్‌లో పూర్ణిమ తిథి నవంబరు 7 సాయంత్రం 4.16 నుంచి మొదలై, 8 మంగళవారం సాయంత్రం 4.31 వరకు వ్యాప్తి ఉన్నది.** కార్తిక పూర్ణిమ సందర్భంగా భక్తులు, వత్తులతో దీప ప్రజ్వలనాలు చేస్తారు. రెండు రోజులలో పూర్ణిమ తిథి ఉంటే వత్తులు ఏ రోజున వెలిగించాలనే సందేహం వచ్చును. వాట్సాప్‌లలో ఎవరికి తోచిన విధంగా సందేశాలు పంపటంచే అనేకమందికి సందేహాలు ఏర్పడుతున్నాయి.

మీ సందేహానికి నివృత్తి ఇదుగో...

అస్యామేవ సాయంకాలవ్యాపిన్యాం త్రిపురోత్సవః కార్యః।
పూర్ణమాస్యాం తు సంధ్యాయాం కర్తవ్యస్త్రిపురోత్సవః।
దద్యాదనేన మన్త్రేణ ప్రదీపాంశ్చ సురాలయే। - నిర్ణయసింధు

**తా॥ పూర్ణిమ సాయంకాల వ్యాప్తి సమయంలోనే త్రిపురోత్సవమును (కార్తిక పూర్ణిమ) చేయాలి. సాయం సమయములో ఆలయమునందు క్రింది మంత్రము ఉచ్ఛరించుచూ కార్తిక దీప ప్రజ్జ్వలన చేయాలి. - నిర్ణయసింధు.**

మంత్రం - **'కీటాః పతంగా మశకాశ్చవృక్షా జలే స్థలే యే విచరంతిజీవాః**

**దృష్ట్వా ప్రదీపం నచ జన్మ భాగినో భవంతు నిత్యం శ్వపదాశ్చవిప్రాః'**

దృగ్గణిత రీత్యా నవంబరు 7 సోమవారం పూర్ణిమ తిథి సాయంత్ర వ్యాప్తి ఉన్నది. 8 మంగళవారం లేదు. ధర్మశాస్త్రమైన నిర్ణయసింధు గ్రంధానుసారం 2022 నవంబరు 7 సోమవారం కార్తికపూర్ణిమ. ఈనాడే త్రిపురోత్సవము ఆచరించాలి.

## కార్తికవ్రత ఉద్యాపన నిర్ణయము - నవంబరు 7

అథోర్జవ్రతినస్సమ్యగుద్యాపనవిధిం శ్రుణు।
ఊర్జే శుక్లచతుర్దశ్యాం కుర్యాదుద్యాపనం ప్రతీ।
తులస్యా హ్యుపరిష్టాత్తు కుర్యాన్మణ్టపికాం శుభామ్।
తులసీమూలదేశే తు సౌవర్ణాం పూజయేద్ధరిమ్।
అతో దేవా ఇతి ద్వాభ్యాం జుహూయాత్ తిలపాయసమ్।
తతో గాం కపిలాం దద్యాత్ పూజయేత్ విధివద్గురుమ్॥

తా॥ శుక్ల చతుర్దశితో కూడిన పూర్ణిమన కార్తికవ్రతోద్యాపన ఆచరించాలి. తులసీమాత మూలమందు పీఠం ఏర్పరిచి, విష్ణువును ఆరాధించాలి. ఈ సమయంలో తెల్ల నువ్వులతో చేసిన పాయసాన్ని నివేదించాలి. అవకాశం ఉన్నవారు గురువుని పూజించి, కపిలగోవును దానమిచ్చుదురు. పై గ్రంధానుసారం దృగ్గణిత రీత్యా 2022 నవంబరు 7 సోమవారమే కార్తికవ్రతోద్యాపనము.

## జ్వాలాతోరణ నిర్ణయము - నవంబరు 7

అస్యామేవ పూర్ణిమాయాం ప్రదోషవ్యాపిన్యాం జ్వాలాతోరణం కార్యమ్। తదుక్తం కాలాదర్శే కార్తికే పూర్ణిమాసే తు సాయంకాలే భవేద్యది।

**సా తిథిస్సకలా తస్మిన్ జ్వాలాతోరణమాచరేత్॥ దినద్వయే సాయంకాలవ్యాప్తౌ పరైవ।**

తదుక్తం చన్ద్రోదయే ప్రాతస్సంకల్పమారభ్య ప్రవృత్తత్వాత్।

తా॥ జ్వాలాతోరణానికి పూర్ణిమ ప్రదోషకాలవ్యాప్తి ఉండాలి. 2 దినములందు పూర్ణిమకు సాయంవ్యాప్తి ఉన్నచో పరదినమే గ్రహించాలి. ప్రాతఃకాల సంకల్ప సమయము ఆరంభించి, ఆ దినాన జ్వాలాతోరణ ఛాయలో కుమారస్వామిని ఉంచవలెను. కనుక 2022 నవంబరు 7 సోమవారం పూర్ణిమ తిథి ప్రదోష కాలములో ఉన్నందున, 7 సోమవారమే జ్వాలాతోరణం.

## మహాకార్తికీ నిర్ణయము - నవంబరు 8

ఇయమేవ భరణీకృత్తికారోహిణీయోగవశాన్మహాకార్తికీత్యుచ్యతే।
సా పరవిద్ధా గ్రాహ్యా । అత్ర భవిష్యత్పురాణమ్।
కార్తికీ పౌర్ణమాసీ తు భూతవిద్ధా భవేద్యది।
సా త్యాజ్యైవ పరా గ్రాహ్యా ప్రతిపన్మిశ్రితా సదా। - స్మృత్యంతరము

తా॥ కార్తికమాసంలో పూర్ణిమ తిథి భరణి, కృత్తిక, రోహిణి నక్షత్రాలతో వచ్చినచో మాత్రమే మహాకార్తికీ అందురు. ఈ మహాకార్తికీని చతుర్దశితో కూడిన పూర్ణిమను వదిలి పాడ్యమితో కూడిన పూర్ణిమను గ్రహించి స్నానాదులు ఆచరించాలి. ఒక్కోసారి మహాకార్తికి పర్వదినం రావచ్చును, రాకపోవచ్చును. శుభకృత్‌లో 2022 నవంబరు 8 మంగళవారం మహాకార్తికీ.



## కార్తిక పూర్ణిమ - చంద్రగ్రహణం - ఓ వివరణ

కార్తిక పూర్ణిమకు, మహాకార్తికి వ్యత్యాసమున్నది. కార్తిక పూర్ణిమ ప్రతి సంవత్సరము ప్రదోషవ్యాప్తితో ఉన్న పూర్ణిమ రోజున ఆచరించాలి. మహా కార్తికి పర్వదినం ప్రతి సంవత్సరం రావచ్చు, రాకపోవచ్చు. బహుళ పాడ్యమితో కూడిన పూర్ణిమ భరణి, కృత్తిక, రోహిణి నక్షత్రాలలో వస్తేనే మహాకార్తికి అంటారు. ఒక్కోసారి అశ్వని నక్షత్రంలో కూడా వస్తుంది. అలా వచ్చినచో మహా కార్తికిగా పిలవరు. కార్తిక పూర్ణిమకు ఆలయాలలో వత్తులతో దీప ప్రజ్జ్వలన చేస్తారు. కానీ మహాకార్తికికి స్నానాదులు ఆచరిస్తారు. ఈ రెండింటి మధ్య వ్యత్యాసాన్ని గమనించేది. ఈ నేపథ్యంలో ఖగోళంలో నవంబరు 8 మంగళవారం మహాకార్తికి పర్వదినాన సంపూర్ణ చంద్రగ్రహణం సంభవిస్తున్నది.

ఆలయాలలో వత్తులతో దీప ప్రజ్జ్వలనాలను నవంబరు 7 కార్తిక పున్నమి రోజే ఆచరిస్తారు. కార్తిక పూర్ణిమ నవంబరు 8 కానే కాదు. నవంబరు 8 వచ్చే పర్వదినం పేరు మహాకార్తికి. ఈనాడు ఆచరించాల్సినది స్నానాదులని గమనించాలి. నవంబరు 8 చంద్రగ్రహణం ఐనందున ఉదయ సమయంలోనే స్నానాదులు ఆచరించి, దైవ దర్శనాలు చేసుకొనేది.కొన్ని ఆలయాలలో ఉదయం నుంచే దర్శనాలు నిలిపివేయవచ్చు. ఇలాంటి సమయాలలో గృహం లోనే ఉదయ సమయంలో తొలి 3 గంటలలోనే పూజాదులు నిర్వహించుకొనేది. తిరిగి సాయంత్రం గ్రహణానంతరం శుద్ధి కార్యక్రమాన్ని ఆచరించేది. చంద్ర గ్రహణ సమయాలు 29వ పేజీలో ఇవ్వబడినవి, గమనించేది.

## ధాత్రీపూజ - నవంబరు 8

అస్యామేవ పరవిద్ధాయాం ధాత్రీపూజా కార్యా।
ధాత్రీమహీరుహే మూలే కార్తిక్యాం నృపసత్తమ।
భుక్త్వా దత్వా చ విప్రాణామగ్నిష్టోమఫలం లభేత్।

తా॥ ధాత్రి అనగా ఉసిరిక. బహుళ పాడ్యమితో కలిసిన పూర్ణిమ నాడు ఉసిరిక చెట్టును పూజించి, ఈ వృక్ష ఛాయయందు భోజనమును చేయాలి. అనగా ఉసిరిక చెట్టు నుంచి వచ్చే గాలులను అధికసమయం పీల్చాలని భావము.కనుక ధర్మశాస్త్ర నిర్ణయాలమేరకు పూర్ణిమ బహుళ పాడ్యమితో కలిసి ఉన్న **2022 నవంబరు 8 మంగళవారం రోజునే ధాత్రీపూజ ఆచరించాలి.** ఖగోళంలో చంద్రగ్రహణం సంభవిస్తున్నందున గ్రహణ స్పర్శకు ముందే ధాత్రీపూజ నిర్వహించుకొని, మూడు గంటల ముందే భోజనాదులను ముగించుకొనేది.

## తులసీ ఉద్యాపన

ఆశ్వయుక్ఛుక్లపక్షస్య ఏకాదశ్యాం నరాధిప।
సమ్యక్ స్నాత్వా చ నద్యాదావారభేత్ తులసీవ్రతమ్।
కార్తికస్య సితే పక్షే ద్వాదశ్యాం వా యథావిధి।
కురుదుద్యాపనం సమ్యక్ పూర్ణిమాయామథాపి వా।

తా॥ ఆశ్వీజ శుక్ల ఏకాదశిన తులసీ వ్రతం ప్రారంభించి, కార్తిక శుక్ల ద్వాదశి లేక పూర్ణిమ తిథులు ఉదయకాలవ్యాప్తిలో ఉండగా తులసీవ్రత ఉద్యాపన చేయాలని నిర్ణయసింధు, స్కాంధం పేర్కొన్నవి. **భారత ప్రభుత్వ ఆమోదిత ప్రామాణిక దృగ్గణిత పంచాంగరీత్యా 2022 నవంబరు 5 శనివారం శుక్ల ద్వాదశి, లేక నవంబరు 8 మంగళవారం పూర్ణిమ తిథులు ఉదయవ్యాప్తిలో ఉన్నందున,ఈ రోజులలో తులసీ ఉద్యాపన ఆచరించాలి.**

## మాసశివరాత్రి ధర్మశాస్త్ర నిర్ణయములు

బ.చతుర్దశి తిధి అర్ధరాత్రి వ్యాపినిగా గ్రహించాలి. మాసశివరాత్రికి ప్రదోషవ్యాప్తి చతుర్దశిని గ్రహించరాదని, నిశీధి వ్యాప్తి చతుర్దశినే గ్రహించమని ధర్మశాస్త్ర గ్రంధములు స్పష్టం చేస్తున్నవి. మాసశివరాత్రి, మహాశివరాత్రి నిర్ణయాలలో రెండు రోజులలో తిధి ఉన్నప్పుడు "పూర్వేద్యుః పరేద్యుః ఉభయేద్యుః అనుభయేద్యుః" అను 4 విధములుగా నిర్ణయములు జరుగును.

**పూర్వేద్యుః పరేద్యురుభయేద్యురనుభయేద్యురితి।**
**తత్రాద్యయోరసన్దేహః ముఖ్యకాలవ్యాప్తేస్సత్వాత్।**

**తా॥** అర్ధరాత్రి వ్యాప్తి నాల్గు రకములు. 1.ముందురోజు అర్ధరాత్రిలో తిధి ఉండుట (పూర్వేద్యుః) 2.రెండోరోజు అర్ధరాత్రి తిధి వ్యాప్తి (పరేద్యుః) 3.రెండు దినాలలో అర్ధరాత్రిలో తిధి వ్యాప్తి (ఉభయేద్యుః) 4.రెండు దినముల అర్ధరాత్రి తిధి లేకుండుట (అనుభయేద్యుః). మొదటి రెండు పద్ధతులలో ఎలాంటి సందేహం లేనే లేదని ధర్మశాస్త్రాలు పేర్కొన్నవి.

**తృతీయపక్షే పరా గ్రాహ్యా। ఉక్తఞ్చ స్కాన్దే - దినద్వయేన్యర్ధరాత్రే వర్తతే యా చతుర్దశి।**
**తదా పరైవ కర్తవ్యా న తు పూర్వా కదాచన॥**

**తా॥** ఈ పద్ధతిలో 2 దినాలలో అర్ధరాత్రి తిధి వ్యాప్తి ఉన్నప్పుడు (ఉభయేద్యుః), రెండవ దినమునే గ్రహించాలి. మొదటి దినమును గ్రహించరాదని స్కన్దపురాణం పేర్కొంది.

**చతుర్థపక్షేపి పరా గ్రాహ్యా। ఉక్తఞ్చ స్కాన్దే - దినద్వయే యదా న స్యాన్మధ్యరాత్రే చతుర్దశీ।**
**తదా పూర్వాం పరిత్యజ్య కర్తవ్యా సా నరైః పరా॥**

**తా॥** 2రోజులలో అర్ధరాత్రి తిధి లేని నాల్గవపద్ధతిలో (అనుభయేద్యుః) కూడా పరదినమునే గ్రహించాలి, పూర్వదినము గ్రహించరాదని స్కన్దపురాణం స్పష్టంగా పేర్కొన్నది.

**అర్ధరాత్రి అనగా (నిశీధి)- మహా నిశాతు విజ్ఞేయా మధ్యస్థ ఘటికాద్వయం॥**

నేటి సూర్యాస్తమయం నుంచి రేపటి సూర్యోదయం వరకున్న రాత్రి సమయంలో ఖచ్చిత మధ్య భాగాన్ని అర్ధరాత్రి అంటారు. అంతేకానీ రాత్రి 12 గంటలని కాదు. ఈ అర్ధరాత్రి సమయానికి ముందు 24 నిముషాలు (ఘడియ), తర్వాత 24 నిముషాలు వెరసి 48 నిముషాలు నిశీధి అనబడును. ఈ సమయమే మాస లేక మహాశివరాత్రికి ముఖ్యము. మాసశివరాత్రి లేక మహాశివరాత్రి పర్వదిన నిర్ణయాలకు ప్రదోష వ్యాప్తి మాత్రమే ఉండాలని ఎక్కడా చెప్పబడలేదు.

**నిర్ణయసింధు** - తత్రేతి రాత్రౌయామ చతుష్టయే పూజా విధానాత్ యస్మిన్దినే అధికారాత్రి వ్యాప్తిః సాగ్రాహ్యా సాయ్యేతు పూర్వైవేతి హేమాద్రిరూచితవాన్। వస్తుతస్తు ప్రతిమాస కృష్ణ చతుర్దశ్యామపి ।అతః ప్రదోష నిశీధ ఉభయ వ్యాప్త్యైవ నిర్ణయః॥...మాఘమాసంలో వచ్చే శివరాత్రి లేక ఇతర మాసములలో వచ్చే మాసశివరాత్రి చతుర్దశిని అర్ధరాత్రి వ్యాప్తిగా (నిశీధి) స్వీకరించాలి. కేవలం ప్రదోష వ్యాప్తిని గ్రహించి మాసశివరాత్రిని నిర్ణయించరాదు.

**ధర్మసింధు** - యత్ర ప్రతిమాసం కృష్ణచతుర్దశ్యాం శివరాత్రి వ్రతం కామ్యం అనుష్ఠీయతే । తత్ర మహాశివరాత్రి వ్రతవత్ నిశీధ వ్యాప్త్యైవగ్రాహ్యా ॥ప్రతి బ.చతుర్దశి శివరాత్రి వ్రతము కామ్యము. మహాశివరాత్రి నిర్ణయించినట్లే మాసశివరాత్రికి కూడా అర్ధరాత్రి వ్యాప్తియే కావలెను.

కనుక ధర్మసింధు, నిర్ణయసింధు, స్మృతికౌస్తుభము, వీరమిత్రోదయము, పురుషార్ధ చింతామణి మొదలైన ధర్మశాస్త్ర నిర్ణయాల ప్రకారం మాసశివరాత్రికి కానీ, మహాశివరాత్రికి

**నిశీధి వ్యాప్తి గల బహుళ చతుర్దశినే స్వీకరించాలి.**
**ప్రదోషవ్యాప్తి గల చతుర్దశిని స్వీకరించరాదని స్పష్టం చేసినవి.**



## వైష్ణవ తిరు నక్షత్రములు - 2022 - 23

**2022 ఏప్రిల్**

10 శల్వపిల్లర్ తి॥న॥
16 మధురకవి యాళ్వార్ తి॥న॥
20 పెరియ పెరుమాళ్ళు తి॥న॥
30 వడుహనంబి తి॥న॥

**2022 మే**

2 ఉయ్యకొండార్ తి॥న॥
6 ఉడయవర్(రామానుజ జయంతి)
7 మొదలియాండాన్ తి॥న॥
13 తేవప్పెరుమాళ్ తి॥న॥
31 తిరుక్కోట్యూర్ నంబి తి॥న॥

**2022 జూన్**

12 నమ్మాళ్వార్ తిరువాయ్ మొలిపిళ్ళ
13 పెరియభట్టర్ శ్రీరామపిళ్ల కోయిల్ కందాడై అణ్ణన్ తి॥న॥

**2022 జూలై**

2 మారనూరునంబి తి॥న॥
9 పెరియాళ్వార్ వడక్కు తిరువీధి పిల్ల
10 శ్రీమన్నాధముని తి॥న॥
11 శఠకోప రామానుజ జియ్యర్
29 ప్రతివాది భయంకర అణ్ణన్ తి॥న॥

**2022 ఆగస్టు**

1 ఆండాళ్ యుదిగిరి నాచ్చియార్ కందాడై తోడప్పర్ తి॥న॥
3 బదరీనారాయణప్పెరుమాళ్ తి॥న॥
10 శ్రీ పుండరీకాక్షర్ - శ్రీ ఆళ్వందార్
20 పెరియవాచ్చాంపిళ్ళ తి॥న॥
21 పరవస్తు పట్టరభిరాన్ జియ్యర్

**2022 అక్టోబరు**

5 తిరువేంగళముడయాన్ వేదాంత దేశికర్ తి॥న॥
29 మళవాళ మహాముని తి॥న॥

**2022 నవంబరు**

1 పొయిఖయాళ్వార్ పిల్లలోకాచార్యర్
2 పూధత్తాళ్వార్ తి॥న॥
3 పెరియాళ్వార్ తి॥న॥
6 అరుళాళ్ళప్పెరుమానెంబెరుమానార్
7 సంపిళ్ళ తిరు మంగయాళ్వార్తి॥న॥
8 తిరుప్పాణియాళ్వార్ తి॥న॥
27 తొండరొడిప్పొడి యాళ్వార్ పెరియ నంబి తి॥న॥

**2023 ఫిబ్రవరి**

4 ఎంబార్ తి॥న॥
7 తిరుముడిశ యాళ్వార్ తి॥న॥
10 కూరత్తాళ్వార్ తి॥న॥

**2023 మార్చి**

1 తిరుక్కచ్చినంబి తి॥న॥
3 కులశేఖరాళ్వార్ తి॥న॥

## మాధ్వ పుణ్యదినములు

**2022 ఏప్రిల్**
03 వేదవ్యాస తీ॥పు॥ 10 కవీంద్ర తీ॥పు॥
14 సత్యప్రియ తీ॥పు॥
19 వాగీశ తీ॥పు॥ 26 సత్యవిజయధ్వజ

**మే**
03 విద్యాధిరాజ 07 రామచంద్ర తీ॥పు॥

**జూన్**
01 సత్యసంధ తీ॥పు॥ 13 సత్యాభినవ తీ॥పు॥
16 సత్యపూర్ణ తీ॥పు॥ 17 రఘువర్య తీ॥పు॥

**జూలై**
08 సత్యాధిరాజ తీ॥పు॥ 18 జయ తీ॥పు॥
28 సత్యాధీశ తీ॥పు॥

**ఆగస్టు**
04 సత్యవర తీ॥పు॥13 రాఘవేంద్ర తీ॥పు॥

**సెప్టెంబరు**
06 సత్యేష్ట కామ తీ॥పు॥ 25 మాధవ తీ॥పు॥

**అక్టోబరు**
02 సత్యపరాయణ తీ॥పు॥

**నవంబరు**
05 వేదనిధి తీ॥పు॥ 12 విద్యానిధి తీ॥పు॥
23 పద్మనాభ తీ॥పు॥

**డిశంబరు**
09 రఘునాధ తీ॥పు॥ 13 అక్షోభ్య తీ॥పు॥

**2023 జనవరి**
03 రఘోత్తమ తీ॥పు॥ 14 సత్యకామ తీ॥పు॥
14 నరహరి తీ॥పు॥

**2023 ఫిబ్రవరి**
01 సత్యజ్ఞాన తీ॥పు॥
02 విష్ణుచిత్త రామానుజ
26 సత్యవ్రత తీ॥పు॥

**2023 మార్చి**
08 సత్యబోధ తీ॥పు॥

# పంచకరహితం - విమర్శ

తెలుగు రాష్ట్రాల నుంచి వెలువడే పంచాంగాలలో ముహూర్త నిర్ణయ విషయంలో కనిపించే ఒక అంశం పంచకరహితం. ఈ పంచకరహితాన్ని అనుసరించాలా?... వద్దా?.. అనే అంశంలో వేలాదిమంది శాస్త్రాచరణ పరాయణులలో తీవ్రసంశయం నెలకొంటుంది. పాటించకపోతే ఏదైనా దుష్పరిణామాలు సంభవిస్తాయేమోననే ఆందోళన చోటుచేసుకుంటున్న నేపథ్యంలో పాఠకులకు అందిస్తున్న ఖచ్చిత సమాచారమిది.

**శాస్త్రం ఏది చెప్పినా నిక్కచ్చిగా, కర్కశంగానే చెబుతుంది.**
**పాటించలేని పరిస్థితి ఏర్పడినప్పుడు జనహితం కోసం**
**ఎప్పుడైనా కొంత వెసులుబాటు కల్పించుకోవటం సహజం.**
**అంతమాత్రాన ఒక అంశంలో సమస్య తలెత్తినప్పుడు ఆ సమస్యకు**
**అనేక రకాలైన వెసలుబాట్లు కల్పించటమనేది ఖచ్చితంగా శాస్త్రవిరుద్ధమే.**
**ఒకవిధంగా చెప్పాలంటే శాస్త్ర ద్రోహం కూడా అవుతుంది.**

అసలేమిటీ పంచకరహితం? ముహూర్త నిర్ణయం చేసేటప్పుడు తిధి, వార, నక్షత్ర, లగ్న సంఖ్యలను కలిపి 9చే భాగించినప్పుడు, శేషం 1వస్తే మృత్యు పంచకమని, 2వస్తే అగ్నిపంచకమని, 4వస్తే రాజపంచకమని, 6వస్తే చోరపంచకమని, 8వస్తే రోగపంచకమని అంటారు. మిగిలిన 3, 5, 7, 9 సంఖ్యలు శేషంగా వస్తే ముహూర్తం పంచకరహితమైనదని, శుభప్రదమైనదని దీని సారాంశం.

ఒకవేళ పై ప్రకారంగా పంచకరహితం కాకుంటే గత తిధి, తాత్కాలిక లగ్న సంఖ్యలను కలిపి 9చే భాగించగా శేషం 3,5,7,9 వస్తే మార్తాండ పంచకరహితమని, శుభప్రదంగా భావించాలని ఒక వెసులుబాటును కల్పించారు.

ఇంతటితో ఆగక  కేవలం పంచకరహితం కోసంగా మరో 2రకాలైన ధృవక పద్ధతులంటూ ఏర్పాటు చేసి ఇంకో రెండు వెసులుబాటులను ఇచ్చారు.

అసలు ఈ విధానాన్ని శాస్త్రమే పేర్కొందా?... రామాయణ, మహాభారతాది మహాకావ్యాలలో సైతం ప్రక్షిప్తాలు కనపడుతున్న నేపథ్యంలో... ఈ అశాస్త్రీయ విధానం కూడా.. ఎవరో తమ పాండిత్య ప్రకర్ష ప్రదర్శనోత్సాహంతో చేసిన ప్రక్షిప్త పాఠంగానే భావించవలసి ఉంటుందని స్పష్టంగా తెలుస్తున్నది.

అందుకే ప్రముఖ జ్యోతిష శాస్త్రవేత్త, విశిష్ట పంచాంగకర్త అయిన దైవజ్ఞ పొన్నలూరి శ్రీనివాసగార్గేయ గారు వంటి దిగ్దంతులు, ఈ పంచకరహిత అంశాన్ని లుప్తం చేసి తమ పంచాంగాన్ని ప్రతి సంవత్సరం వెలువరిస్తున్నారు. కేవలం ఒకటి, రెండు ప్రాంతాలకు మాత్రమే పరిమితమైన ఈ పంచకరహితమనే విధానం ప్రజానీకంలో సందిగ్ధతను కలుగచేసి అంతటా దుర్వ్యవస్థను కలుగజేయటం సమంజసమూ కాదు, శ్రేయోదాయకమూ కాదు. అనేక రకాల వెసులుబాటులను కల్పించిన ఈ అశాస్త్రీయ **పంచకరహిత వ్యవస్థకు స్వస్తి చెప్పి, శాస్త్ర ప్రయోజనాలను కాపాడటం అందరి విధి... బాధ్యతా కూడా. అందుకే ఈ అప్రధానమైన అంశాన్ని పాటించవలసిన అవసరమూ, అగత్యమూ కూడా లేదు. పంచకరహితం లేకుంటే ఎలాంటి దుష్పరిణామాలు, ఇబ్బందులు సంభవించవని గ్రహించమనవి.**

***డా. మద్దూరి శివప్రసాద్***



## మార్చి శ్రీ శోభకృత్-చైత్రం-వసంతఋతువు 2023

| | | | |
|---|---|---|---|
| గుచం బుర | రా శు | | కు |
| శ | **22** బుధ 6.14-6.15 | | |
| | | | |
| | | కే | |

చంద్రోదయం: ఉ06.35
చంద్రాస్తమం: రా07.03

చైత్రమాసారంభం
శు. పాడ్యమి:రా8.20
ఉత్తరాభాద్ర:మ3.32
వర్జ్యం:రా2.50-4.21+
దుర్ము:రా11.50-12.38
అమృత:మ11.07-12.35
శుక్లయోగం:ఉ9.18
కింస్తుఘ్నకరణం:ఉ9.33
బవకరణం:రా8.20
రా.కా:మ12.14-1.45
అభిజిత్:లేదు

**నక్షత్రపాదప్రారంభాలు**
ఉత్తరాభాద్ర4 : ఉ9.58
రేవతి1 : మ3.33
రేవతి2 : రా9.08
రేవతి3 : రా.తె2.46+

**శ్రీ శోభకృత్ ఉగాది**
**వసంత నవరాత్రాంభం**
**పితృతిధి : శు.పాడ్యమి**

| | | | |
|---|---|---|---|
| గుచం బుర | రా శు | | కు |
| శ | **23** గురు 6.13-6.15 | | |
| | | | |
| | | కే | |

చంద్రోదయం: ఉ07.15
చంద్రాస్తమం: రా07.59

శు. విదియ:సా6.20
రేవతి:మ2.08; చంద్ర మేష ప్రవేశం మ2.09
వర్జ్యం:లేదు
దుర్ము:ఉ10.14-11.02
మ3.03-3.31
అమృత:మ11.53-1.23
బ్రహ్మయోగం:ఉ6.16
ఇంద్రయోగం:రా.తె3.43
బాలవకరణం:ఉ7.16
కౌలవకరణం:సా6.20
తైతులకరణం:రా.తె5.35+
రా.కా:మ1.44-3.15
అభిజిత్:మ11.50-12.38

**నక్షత్రపాదప్రారంభాలు**
రేవతి4 : ఉ8.26
అశ్వని1 : మ2.09
అశ్వని2 : రా7.53
అశ్వని3 : రా.తె1.40+

**పితృతిధి : శు.విదియ**

| | | | |
|---|---|---|---|
| గురు బు | రా శు చం | | కు |
| శ | **24** శుక్ర 6.12-6.15 | | |
| | | | |
| | | కే | |

చంద్రోదయం: ఉ07.55
చంద్రాస్తమం: రా08.56

శు. తదియ:సా4.59
అశ్వని:మ1.22
వర్జ్యం:ఉ9.30-11.03
రా10.57-12.33
దుర్ము:ఉ8.36-9.25
మ12.38-1.26
అమృత:ఉ6.24-7.57
వైధృతియోగం:రా1.43+
గరజికరణం:సా4.59
వణిజకరణం:రా.తె4.35+
రా.కా:ఉ10.43-12.14
అభిజిత్:మ11.50-12.38

**నక్షత్రపాదప్రారంభాలు**
అశ్వని4 : ఉ7.30
భరణి1 : మ1.23
భరణి2 : రా7.17
భరణి3 : రా1.15+

**పితృతిధి : శు.తదియ**

### నిత్య నిరయణ లగ్నాంతకాలములు

| | | | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| మీన | 07.26 | కన్య | 07.48 | మీన | 07.22 | కన్య | 07.44 | మీన | 07.18 | కన్య | 07.40 |
| మేష | 09.12 | తుల | 09.58 | మేష | 09.08 | తుల | 09.54 | మేష | 09.04 | తుల | 09.50 |
| వృష | 11.13 | వృశ్చి | 12.12 | వృష | 11.09 | వృశ్చి | 12.08 | వృష | 11.05 | వృశ్చి | 12.04 |
| మిధు | 01.25 | ధను | 02.21 | మిధు | 01.21 | ధను | 02.17 | మిధు | 01.17 | ధను | 02.13 |
| కర్క | 03.37 | మక | 04.13 | కర్క | 03.33 | మక | 04.09 | కర్క | 03.29 | మక | 04.05 |
| సింహ | 05.43 | కుంభ | 05.52 | సింహ | 05.39 | కుంభ | 05.48 | సింహ | 05.35 | కుంభ | 05.44 |

## పాఠకులకు ముఖ్య గమనిక

ఈ కాలయోగం పంచాంగములోని ముహూర్తములన్నియు సూచితములే. 'స్వల్పాన్ దోష గుణాన్ గుణాంశ్చ గణితాన్ విశ్చిత్య శాస్త్రాత్స్ఫుటం' అన్నట్లుగా దోషాలు స్వల్పమైనా గుణాధిక్యము కలవని భావము. విజయవాడ మినహా మిగిలిన ప్రాంతీయులందరూ ప్రక్క పేజీలోని దేశాంతర సంస్కార పట్టికననుసరించి, ఈ పంచాంగములో ఇచ్చిన ముహూర్త సమయాలలో హెచ్చు తగ్గులను సరిజేసుకొనవలసినది. ముహూర్తచింతామణి ముహూర్త మార్తాండం కాలామృతం ధర్మసింధు వశిష్ఠ నారద భృగు గర్గసంహితాది గ్రంథాలలో, ఏకవింశతి మహాదోషాలలో రాహుకాల ప్రస్తావన లేదు. అందుచే ముహూర్త సమయంలో రాహుకాలం ఉంటే దోషం కాదు.

పలు వెసులుబాట్లతో నిర్ణయించే పంచకరహితం అశాస్త్రీయం, మరియు శాస్త్రద్రోహం. కనుక మా పంచాంగములో పంచకరహితాలకు ప్రాధాన్యత ఇవ్వలేదు. పూర్వగణిత పంచాంగ తిథి నక్షత్రాలకు, దృగ్గణిత తిథి నక్షత్రాలకు సమయ వ్యత్యాసములుండును. పూర్వగణిత పంచాంగంలో కృత్తిక 4వపాద సమయానికి దృగ్గణితంలో రోహిణి నక్షత్రం జరుగుతున్నదనుకుందాం. దృగ్గణిత రీత్యా రోహిణికి ముహూర్తము ఇచ్చెదము. ఆరోజున పూర్వగణిత పంచాంగంలోని నక్షత్రాన్ని దృష్టిలో ఉంచుకొని, కొందరు దృగ్గణిత పంచాంగ ముహూర్తాన్ని దూషించటం జరుగుతున్నది. కనుక విచక్షణతో గమనించేది.

**ముహూర్త సమయానికి రాశిచక్రంలో ఒక్కోసారి**
**లగ్న, సప్తమ, అష్టమస్థానాలలో చంద్ర లేక కుజుడు ఉండవచ్చు.**
**అష్టమచంద్ర, కుజులుంటే ముహూర్తం ఎలా ఇచ్చారనే**
**ప్రశ్న పాఠకులకు ఉదయించవచ్చు.**
**లగ్న బిందువులకు, చంద్ర కుజులకు ఉన్న దూరాన్ని**
**ఖచ్చిత డిగ్రీలలో గణించి, లగ్న సప్తమ అష్టమస్థానాలలో**
**చంద్ర, కుజస్పర్శలు లేనివి ముహూర్తాలుగా ఇవ్వడమైనది.**

దైవ, దైవజ్ఞుల సన్నిధులలోను, భూసుర, వాక్సుద్ధిగల
ఉత్తమ పురుషుల సమక్షంలో సుముహూర్తాలను నిర్ణయించుకొనిన
వేలాది దోషాలు హరించుననని శాస్త్ర వచనములు.
విజ్ఞులైన పండితులు వివిధ గ్రంథాధారములు చూపించి
తర్కవితర్కములు చేయక, మీ ప్రాంతీయ ఆచారాలనుసరించి,
దేశాచార కులాచార మతాచార జాత్యాచార వ్యవహారములకు తగినట్లుగా
సుముహూర్తములను నిర్ణయించుకొని
సకల శుభకార్యములను ఆచరించుట సర్వదా శ్రేయస్కరము.
విజయవాడ మినహా మిగిలిన ప్రాంతీయులందరూ
ప్రక్క పేజీలోని దేశాంతర సంస్కార పట్టికననుసరించి,
ఆయా లగ్నాలకు తగినట్లుగా హెచ్చు తగ్గులను సరిజేసుకొని
ఖచ్చిత ముహూర్త లగ్నసమయాలను నిర్ణయించుకోగలరు.

**పొన్నలూరి శ్రీనివాసగార్గేయ**
**భారత ప్రభుత్వ ఆమోద గణిత పంచాంగకర్త**
**హైద్రాబాద్ - విజయవాడ**



## విజయవాడ నుండి దేశాంతర సంస్కార పట్టిక

| ప్రాంతము | మే వృ మి | క సిం క | తు వృ ధ | మ కు మీ |
|---|---|---|---|---|
| శ్రీకాకుళం | -14-15-17 | -16-14-14 | -12-10-10 | -11-12-12 |
| విజయనగరం | -12-13-14 | -13-12-12 | -10-10-08 | -09-10-10 |
| విశాఖపట్టణం | -11-11-12 | -12-11-11 | -09-08-08 | -09-09-09 |
| కాకినాడ | -06-06-07 | -07-06-06 | -06-05-05 | -06-06-06 |
| రాజమండ్రి | -04-04-05 | -05-04-04 | -04-03-03 | -04-04-04 |
| ఏలూరు | -02-02-02 | -02-02-02 | -02-02-02 | -02-02-02 |
| మచిలీపట్నం | -01-01-01 | -01-01-02 | -03-03-03 | -03-03-02 |
| ఖమ్మం | +02+02+01 | +01+01+02 | +02+02+01 | 00 00 +01 |
| గుంటూరు | +02+02+01 | +01+02+01 | 00 +01+01 | 00 00 +01 |
| ఒంగోలు | +02+02+02 | +02+02+02 | 00 00 00 | 00 00 +01 |
| నరసరావుపేట | +04+04+04 | +04+04+08 | +02+01+02 | +02+02+03 |
| జగ్గయ్యపేట | +02+02+01 | +01+01+02 | +02+03+03 | +02+02+03 |
| నెల్లూరు | +05+07+05 | +07+07+03 | +01 00 00 | +01 00 +03 |
| తిరుపతి | +10+11+11 | +11+10+06 | +04+02+01 | +01+02+06 |
| చిత్తూరు | +09+12+12 | +12+11+06 | +03+09+00 | 00+02+06 |
| కడప | +10+12+12 | +12+12+08 | +06+05+05 | +04+05+08 |
| కర్నూల్ | +12+12+12 | +12+12+11 | +10+10+10 | +10+10+11 |
| అనంతపురం | +14+15+15 | +16+15+12 | +11+10+09 | +08+09+12 |
| నల్గొండ | +06+02+05 | +05+06+06 | +06+07+07 | +06+06+06 |
| శ్రీశైలం | +08+08+08 | +08+08+07 | +06+06+06 | +06+06+07 |
| కరీంనగర్ | +05+04+02 | +03+05+05 | +07+09+10 | +08+07+07 |
| మెదక్ | +09+08+07 | +08+09+09 | +11+12+13 | +12+11+11 |
| ఆదిలాబాద్ | +07+05+03 | +04+06+08 | +11+14+15 | +13+12+08 |
| నిజామాబాద్ | +10+08+07 | +08+09+10 | +12+14+15 | +14+13+12 |
| మ.బూబ్‌నగర్ | +11+11+11 | +11+11+11 | +11+11+11 | +11+11+11 |
| గుంతకల్ | +15+16+16 | +16+16+13 | +12+11+11 | +10+11+13 |
| వరంగల్ | +04+03+02 | +03+04+04 | +06+07+08 | +07+06+06 |
| చెన్నై | +06+08+06 | +08+07+02 | -01-03-04 | -04-03-02 |
| బెంగళూరు | +16+18+18 | +18+18+13 | +10+11-08 | -07-08+13 |
| మైసూరు | +20+23+23 | +23+12+17 | +12+10+09 | +09+10+15 |
| హైద్రాబాద్ | +09+08+07 | +08+09+09 | +09+10+11 | +10+09+09 |

# చైత్రం సుముహూర్తములు
## 2022 ఏప్రిల్ 02 - ఏప్రిల్ 30

ముహూర్త నిర్ణయానికి పంచకరహితం ఓ పద్ధతిలో చేయండి. కాకుంటే మరో పద్ధతి చేయండి. అప్పుడు లేకుంటే ఇంకో పద్ధతి చూడండి. ఇలా పలు వెసులుబాట్లు కల్పించే పంచకరహిత పద్ధతి అశాస్త్రీయం. కనుక ఈ అశాస్త్రీయ పద్ధతిని మేము పాటించడంలేదు.

| తేదీ | వివరాలు |
|---|---|
| ఏప్రిల్ 02 శని | శు.పాడ్యమి రేవతి మేషలగ్నం ఉ6.38-8.24<br>పుష్కరాంశ ఉ7.51,నవవస్త్రాభరణధారణ శుభాకాంక్షల పర్వం<br>శు.విదియ రేవతి మిధునలగ్నం ఉ10.25-12.37<br>శుభాంశ ఉ10.32, శుభ దర్శనాలు, నూతన ప్రారంభాలు |
| ఏప్రిల్ 06 బుధ | శు.పంచమి రోహిణి మేషలగ్నం ఉ6.24-8.10<br>పుష్కరాంశ ఉ7.37, శుభాంశ ఉ8.04<br>వివాహ, ఉపనయన, గృహారంభ, గృహప్రవేశ, శుభాదులు |
| ఏప్రిల్ 06 బుధ | శు.పంచమి రోహిణి సింహలగ్నం మ2.35-4.41<br>పుష్కర సా4.04, వాణిజ్యం, ఊయల, శుభతాంబూలాలు<br>శు.పంచమి రోహిణి కన్యాలగ్నం సా4.41-6.46<br>వర్గోత్తమాంశ సా4.48, పుష్కరాంశ సా5.40<br>వాణిజ్యం, డోలారోహణం, విద్యా, వ్యాపార ప్రారంభాలు |
| ఏప్రిల్ 06 బుధ | శు.షష్ఠి మృగశిర కుంభలగ్నం రా.తె3.11-4.50<br>వర్గోత్తమాంశ రా.తె4.00, పుష్కరాంశ రా.తె4.30<br>వివాహ, గృహప్రవేశ, గృహారంభ, బోరింగ్‌లు |
| ఏప్రిల్ 07 గురు | శు.షష్ఠి మృగశిర మేషలగ్నం ఉ6.20-8.06<br>పుష్కరాంశ ఉ7.33, శుభాంశ ఉ8.00<br>వివాహోపనయన, గృహారంభ, గృహప్రవేశ, అక్షర శుభాదులు |
| ఏప్రిల్ 07 గురు | శు.షష్ఠి మృగశిర కన్యాలగ్నం సా4.37-6.42<br>వర్గోత్తమాంశ సా4.44, పుష్కరాంశ సా5.36, శుభాంశ సా5.58<br>ఊయల, పెండ్లిచూపులు, వాణిజ్యం, అగ్రిమెంట్లు, శుభచర్చలు |
| ఏప్రిల్ 07 గురు | శు.షష్ఠి మృగశిర తులాలగ్నం సా6.42-8.52<br>పుష్కరాంశ రా8.27, శు.సప్తమికి శుభాంశ రా8.47<br>వివాహ, గృహప్రవేశ, శుభ తాంబూల, విద్యా, వ్యాపార ప్రారంభాలు |
| ఏప్రిల్ 08 శుక్ర | శు.సప్తమి ఆరుద్ర మేషలగ్నం ఉ6.16-8.02<br>పుష్కరాంశ ఉ7.29, శుభాంశ ఉ7.56<br>ఋగ్వేద ఉపనయన, అక్షర, అన్నప్రాసన, ధనుర్విద్యారంభం |
| ఏప్రిల్ 08 శుక్ర | శు.సప్తమి ఆరుద్ర కన్యాలగ్నం సా4.33-6.38<br>వర్గోత్తమాంశ సా4.40, పుష్కరాంశ సా5.32, శుభాంశ సా5.54<br>ఊయల, పెండ్లిచూపులు, క్రయవిక్రయాలు |
| ఏప్రిల్ 09 శని | శు.అష్టమి పునర్వసు మేషలగ్నం ఉ6.12-7.58<br>శుభాంశ ఉ7.52, ఉపనయన శుభాదులు<br>శు.అష్టమి పునర్వసు కన్యాలగ్నం సా4.29-6.34<br>పుష్కరాంశ సా5.28, శుభాంశ సా5.50<br>డోలారోహణం, వాణిజ్యం, విద్యారంభం |
| 09 శని | శు.అష్టమి పునర్వసు తులాలగ్నం సా6.34-8.44<br>పుష్కరాంశ రా8.19, శుభాంశ రా8.39, గృహప్రవేశాదులు |



# శిశు జనన నక్షత్ర పాద దోష వివరణ

| నక్షత్రం | పాదం 1 | పాదం 2 | పాదం 3 | పాదం 4 |
|---|---|---|---|---|
| అశ్వని | తండ్రి,శిశువు | మంచిది | మంచిది | మంచిది |
| భరణి | మంచిది | మంచిది | తల్లితండ్రి | మంచిది |
| కృత్తిక | మంచిది | మంచిది | తల్లితండ్రి | మంచిది |
| రోహిణి | తల్లి,మేనమామ | తల్లి,మేనమామ | మేనమామ | మంచిది |
| మృగశిర | మంచిది | మంచిది | మంచిది | మంచిది |
| ఆర్ద్ర | మంచిది | మంచిది | మంచిది | సామాన్యము |
| పునర్వసు | మంచిది | మంచిది | మంచిది | మంచిది |
| పుష్యమి | మంచిది | తల్లి,తండ్రి | తల్లి,తండ్రి | మంచిది |
| ఆశ్లేష | సామాన్యము | ధనము | తల్లి, తండ్రి | సామాన్యము |
| మఘ | శిశువు | మంచిది | తల్లి,తండ్రి | మంచిది |
| పుబ్బ | మంచిది | మంచిది | మంచిది | సామాన్యము |
| ఉత్తర | తల్లి,తండ్రి | మంచిది | మంచిది | సామాన్యము |
| హస్త | మంచిది | మంచిది | తల్లి,తండ్రి | మంచిది |
| చిత్ర | తల్లి,తండ్రి | తల్లి,తండ్రి | సామాన్యము | సామాన్యము |
| స్వాతి | మంచిది | మంచిది | మంచిది | మంచిది |
| విశాఖ | దోషయుక్తం | దోషయుక్తం | దోషయుక్తం | దోషయుక్తం |
| అనూరాధ | మంచిది | మంచిది | మంచిది | మంచిది |
| జ్యేష్ఠ | తల్లి | దోషయుక్తం | దోషయుక్తం | దోషయుక్తం |
| మూల | తల్లి,తండ్రి | తండ్రి | ధనానికి | మంచిది |
| పూర్వాషాఢ | మంచిది | మంచిది | తల్లి,తండ్రి | మంచిది |
| ఉత్తరాషాఢ | మంచిది | మంచిది | మంచిది | మంచిది |
| శ్రవణం | మంచిది | మంచిది | మంచిది | మంచిది |
| ధనిష్ఠ | మంచిది | మంచిది | మంచిది | మంచిది |
| శతభిషం | మంచిది | మంచిది | మంచిది | మంచిది |
| పూర్వాభాద్ర | మంచిది | మంచిది | మంచిది | సామాన్యము |
| ఉత్తరాభాద్ర | మంచిది | మంచిది | మంచిది | మంచిది |
| రేవతి | మంచిది | మంచిది | మంచిది | శిశువు |

శిశుజనన సమయానికి ఉన్న నవగ్రహస్థితులను తెల్పే లగ్న కుండలిని వేసుకొని పరిశీలించేది. లగ్నశని, ద్వితీయ కేతువు, తృతీయంలో గురువు, చతుర్థ లేక సప్తమంలో బుధుడు, పంచమ లేక ద్వాదశ రవి, షష్ఠశుక్రుడు, సప్తమంలో కుజుడు, అష్టమంలో చంద్రుడు, నవమ రాహువులున్నచో బాలారిష్టదోషములనబడును. సప్తమ బుధుడు, ద్వాదశ రవి అనుభవంలో దోషములివ్వటం లేదు. - పంచాంగకర్త

## జన్మనక్షత్రానికి అధిపతి, రాశి, దశ, ఆధిపత్య దేవత, గణ, జంతు, నాడీ, నామప్రథమాక్షరాలు

| నక్షత్రము | నక్షత్ర రాశి | నక్షత్ర అధిపతి | జన్మకాల దశ సంవత్సరాలు | ఆధిపత్య దేవత | పేరులో మొదటి అక్షరము | గణము | జంతువు | నాడి |
|---|---|---|---|---|---|---|---|---|
| అశ్వని | మేషం | కేతువు | కేతు-7 | అశ్వినీదేవతలు | చూ, చే, చో, లా, ప్ర, ప్ల, హ్లో, క్లే, లా | దేవ | గుర్రము | ఆది |
| భరణి | మేషం | శుక్రుడు | శుక్ర-20 | యముడు | లీ, లూ, లే, లో | మనుష్య | ఏనుగు | మధ్య |
| కృత్తిక 1వపాదం | మేషం | రవి | రవి-6 | అగ్ని | అ, ఐ, ఐం | రాక్షస | మేక | అంత్య |
| కృత్తిక 2,3,4 | వృషభం | రవి | రవి-6 | అగ్ని | ఈ, ఊ, ఏ, తృ, బు | రాక్షస | మేక | అంత్య |
| రోహిణి | వృషభం | చంద్ర | చంద్ర-10 | బ్రహ్మ | ఓ, వా, వీ, వూ, స్వా, స్వ, వృ | మనుష్య | సర్పము | అంత్య |
| మృగశిర 1,2 | వృషభం | కుజుడు | కుజ-7 | చంద్రుడు | వే, వో, శ్వే, వై | దేవ | సర్పము | మధ్య |
| మృగశిర 3,4 | మిధునం | కుజుడు | కుజ-7 | చంద్రుడు | కా, కి, కీ, కృ, వై, శ్వే, క్ర, క్రా | దేవ | సర్పము | మధ్య |
| ఆర్ద్ర | మిధునం | రాహువు | రాహు-18 | రుద్రుడు | కూ, ఖం, జ్ఞా, చ్ఛ | మనుష్య | కుక్క | ఆది |
| పునర్వసు 1,2,3 | మిధునం | గురువు | గురు-16 | అదితి | కే, కో, హా, కా, కై | దేవ | పిల్లి | ఆది |
| పునర్వసు 4 | కర్కాటకం | గురువు | గురు-16 | అదితి | హి | దేవ | పిల్లి | ఆది |
| పుష్యమి | కర్కాటకం | శని | శని-19 | గురువు | హు, హే, హొూ, డా | దేవ | మేక | మధ్య |
| ఆశ్లేష | కర్కాటకం | బుధుడు | బుధ-17 | సర్పము | డీ, డూ, డే, డో | రాక్షస | పిల్లి | అంత్య |
| మఖ | సింహం | కేతువు | కేతు-7 | పితృదేవతలు | మా, మీ, మూ, మే, మృ, | రాక్షస | ఎలుక | అంత్య |
| పుబ్బ | సింహం | శుక్రుడు | శుక్ర-20 | భవుడు | మో, టా, టీ, టూ, మౌ | మనుష్య | ఎలుక | మధ్య |
| ఉత్తర 1వపాదం | సింహం | రవి | రవి-6 | అర్యముడు | టే | మనుష్య | గోవు | ఆది |
| ఉత్తర 2,3,4 | కన్య | రవి | రవి-6 | అర్యముడు | టో, పా, పి, ఫ, పౌ, స్ప | మనుష్య | గోవు | ఆది |
| హస్త | కన్య | చంద్రుడు | చంద్ర-10 | శని | పూ, షం, ణా, ఠ, క్షే | దేవ | దున్నపోతు | ఆది |
| చిత్ర 1,2 | కన్య | కుజుడు | కుజ-7 | త్వష్ట | పే, పో | రాక్షస | పులి | మధ్య |
| చిత్ర 3,4 | తుల | కుజుడు | కుజ-7 | త్వష్ట | రా, రి, ప్రే, గ్ర, శ్రా, శ్రీ, బ్ర, భ్ర, | రాక్షస | పులి | మధ్య |



| | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|
| స్వాతి | తుల | రాహువు | రాహు-18 | వాయువు | రూ, రే, రో, తా, సృ, హృ, ద్రో, ద్రా, త్రి | దేవ | దున్న | అంత్య |
| విశాఖ 1,2,3 | తుల | గురువు | గురు-16 | ఇంద్రాగ్నులు | తీ, తూ, తే | రాక్షస | పులి | అంత్య |
| విశాఖ 4 | వృశ్చికం | గురువు | గురు-16 | ఇంద్రాగ్నులు | తో | రాక్షస | పులి | అంత్య |
| అనూరాధ | వృశ్చికం | శని | శని-19 | మిత్ర | నా, నీ, నూ, నే, స్నే, స్ను | దేవ | జింక | మధ్య |
| జ్యేష్ఠ | వృశ్చికం | బుధుడు | బుధ-17 | ఇంద్రుడు | నో, యా, యి, యూ, శ్యా, త్ర్యం | రాక్షస | లేడి | ఆది |
| మూల | ధనస్సు | కేతువు | కేతు-7 | రాక్షసుడు | యే, యో, భా, భీ, జ్యో, భౌ, చ్య, చ్యు, భీ | రాక్షస | కుక్క | ఆది |
| పూర్వాషాఢ | ధనస్సు | శుక్రుడు | శుక్ర-20 | జలము | భూ, థ, ఫ, ఢా, భై, ధూ, ధ్వ, ధ్యా, ధృ | మనుష్య | కోతి | మధ్య |
| ఉత్తరాషాఢ 1 | ధనస్సు | రవి | రవి-6 | విశ్వేదేవతలు | భే | మనుష్య | ముంగిస | అంత్య |
| ఉత్తరాషాఢ 2,3,4 | మకరం | రవి | రవి-6 | విశ్వేదేవతలు | భో, జా, జి | మనుష్య | ముంగిస | అంత్య |
| శ్రవణం | మకరం | చంద్రుడు | చంద్ర-10 | విష్ణువు | జూ, జె, జో, ఖా, ఖు, ఖై | దేవ | కోతి | అంత్య |
| ధనిష్ఠ 1,2 | మకరం | కుజుడు | కుజ-7 | వసువులు | గా, గీ | రాక్షస | సింహ | మధ్య |
| ధనిష్ఠ 3,4 | కుంభం | కుజుడు | కుజ-7 | వసువులు | గూ, గే | రాక్షస | సింహ | మధ్య |
| శతభిషం | కుంభం | రాహువు | రాహు-18 | వరుణుడు | గో, సా, సీ, సూ, గౌ | రాక్షస | గుర్రం | ఆది |
| పూ.భాద్ర 1,2,3 | కుంభం | గురువు | గురు-16 | అజైకపాదుడు | సే, సో, దా, సౌ, దై, ద్రా, ద్వ, ధ్యు | మనుష్య | సింహం | ఆది |
| పూర్వాభాద్ర 4 | మీనం | గురువు | గురు-16 | అజైకపాదుడు | ది | మనుష్య | సింహం | ఆది |
| ఉత్తరాభాద్ర | మీనం | శని | శని-19 | అహిర్బుధ్నుడు | దు, శ్యం, ఝా, థా, శ్రై, శి, శం, శో, శౌ, శాం | మనుష్య | గోవు | మధ్య |
| రేవతి | మీనం | బుధుడు | బుధ-17 | పూష | దే, దో, చా, చి, చై, చౌ | దేవ | ఏనుగు | అంత్య |

జన్మనక్షత్ర సంకేతాక్షర ప్రారంభంతో శిశువులకు నామకరణం చేయటం పరిపాటి. కొన్ని సంకేత అక్షరాలతో పేరు నిర్ణయం అసంభవం. శిశు జనన నక్షత్రాలు కలకాలం గుర్తుండటానికై, సంకేత అక్షరాలతో నామకరణం అలవాటైనది. గతంలో జన్మనక్షత్ర సంకేత అక్షరాన్ని పండితులు తెల్పినను, మరణించిన పెద్దల పేర్లతో నామకరణం జరగాలనే నమ్మకాలు ఉన్నందున సంకేత అక్షరాలకు కూడా కొంతమంది ప్రాధాన్యత ఇవ్వలేదు. అందుచే జీవితకాలం జన్మనక్షత్ర గుర్తుండటానికై, గుర్రము, ఏనుగు వంటివి పంచాంగాలలో సంకేత జంతువులుగా చోటుచేసుకున్నాయి. సంకేత జంతువుల ఆధారితంగా వివాహ నిర్ణయాలలో ఒక్కోసారి విరోధ జంతువులైతే వివాహం తగదని అనుకుంటారు. జన్మనక్షత్ర రీత్యా జాతక పొంతనలకే ప్రాధాన్యత తప్ప, జంతువులకు ప్రాధాన్యత ఇవ్వతగదు.రోజులు మారాయి, నచ్చిన పేరును నిర్ణయించుకొని, జన్మనక్షత్రాన్ని గుర్తుంచుకోవటం శ్రేయోదాయకం.

# నవగ్రహ మహాదశలు - అంతర్ధశల సమయ నిర్ణయ పట్టిక

| కృత్తిక, ఉత్తర, ఉ.షాఢ వారలకు | రోహిణి, హస్త శ్రవణం వారలకు | మృగశిర, చిత్ర ధనిష్ఠ వారలకు | ఆర్ద్ర, స్వాతి శతభిషం వారలకు | పునర్వసు,విశాఖ పూర్వాభాద్ర వారలకు | పుష్యమి,అనూరాధ ఉత్తరాభాద్ర వారలకు | ఆశ్లేష, జ్యేష్ఠ రేవతి వారలకు | అశ్వని, మఘ, మూల వారలకు | భరణి, పుబ్బ పూర్వాషాఢ వారలకు |
|---|---|---|---|---|---|---|---|---|
| రవి మహాదశ | చంద్ర మహాదశ | కుజ మహాదశ | రాహు మహాదశ | గురు మహాదశ | శని మహాదశ | బుధ మహాదశ | కేతు మహాదశ | శుక్ర మహాదశ |
| అం మా ది | అం మా ది | అం మా ది | అం మా ది | అం మా ది | అం మా ది | అం మా ది | అం మా ది | అం మా ది |
| ర 03 18 | చం 10 00 | కు 04 27 | రా 32 12 | గు 25 18 | శ 36 03 | బు 28 27 | కే 04 27 | శు 40 00 |
| చం 06 00 | కు 07 00 | రా 12 18 | గు 28 24 | శ 30 12 | బు 32 09 | కే 11 27 | శు 14 00 | ర 12 00 |
| కు 04 06 | రా 18 00 | గు 11 06 | శ 34 06 | బు 27 06 | కే 13 09 | శు 34 00 | ర 04 06 | చం 20 00 |
| రా 10 24 | గు 16 00 | శ 13 09 | బు 30 18 | కే 11 06 | శు 38 00 | ర 10 06 | చం 07 00 | కు 14 00 |
| గు 09 18 | శ 19 00 | బు 11 27 | కే 12 18 | శు 32 00 | ర 11 12 | చం 17 00 | కు 04 27 | రా 36 00 |
| శ 11 12 | బు 17 00 | కే 04 27 | శు 36 00 | ర 09 18 | చం 19 00 | కు 11 27 | రా 12 18 | గు 32 00 |
| బు 10 06 | కే 07 00 | శు 14 00 | ర 10 24 | చం 16 00 | కు 13 09 | రా 30 18 | గు 11 06 | శ 38 00 |
| కే 04 06 | శు 20 00 | ర 04 06 | చం 18 00 | కు 11 06 | రా 34 06 | గు 27 08 | శ 13 09 | బు 34 00 |
| శు 12 00 | ర 06 00 | చం 07 00 | కు 12 18 | రా 28 24 | గు 30 12 | శ 32 09 | బు 11 27 | కే 14 00 |
| మొ 6 సం॥ | మొ 10 సం॥ | మొ 7 సం॥ | మొ 18 సం॥ | మొ 16 సం॥ | మొ 19 సం॥ | మొ 17 సం॥ | మొ 7 సం॥ | మొ 20 సం॥ |

**బాలారిష్ట మహాదశలు :** జన్మలగ్నం నుంచి లగ్నంలో శని, పంచమంలో లేక ద్వాదశంలో రవి, తృతీయంలో గురువు, చతుర్థ లేక సప్తమంలో బుధుడు, షష్టమంలో శుక్రుడు, సప్తమంలో కుజుడు, అష్టమంలో చంద్రుడు, నవమంలో రాహువు, ద్వితీయంలో కేతువు ఉన్నచో అరిష్టప్రదులగుదురు. వారి వారి మహాదశలు వచ్చినప్పుడు మరణము సంభవింప చేయుదురు. కావున తప్పనిసరిగా తగిన రీతిలో పరిహార శాంతి చేసుకొనవలెను.



# గృహారంభ, గృహప్రవేశములకు వృషభచక్ర శుద్ధి, కలశచక్ర శుద్ధి పట్టిక

| రవి సంచార నక్షత్రము | వృషభచక్ర శుద్ధి నక్షత్రాలు | కలశచక్ర శుద్ధి నక్షత్రాలు | వృషభ, కలశచక్ర శుద్ధుల నక్షత్రాలు |
|---|---|---|---|
| **అశ్వని** | పుష్యమి,మఖ,స్వాతి,అనూరాధ,మూల, ఉ.షాఢ,శ్రవణం,ధనిష్ఠ,శత,ఉ.భాద్ర,రేవతి | పునర్వసు,పుష్యమి,మఖ,ఉత్తర,హస్త,శ్రవణం, ధనిష్ఠ,శతభిషం,ఉత్తరాభాద్ర,రేవతి | పుష్యమి,మఖ,శ్రవణం,ధనిష్ఠ,శతభిషం, ఉత్తరాభాద్ర,రేవతి |
| **భరణి** | అశ్వని,మఖ,ఉత్తర,హస్త,అనూరాధ,మూల, ఉ.షాఢ,శ్రవణం,ధనిష్ఠ,శతభిషం,ఉ.భా,రేవతి | అశ్వని,పునర్వసు,పుష్యమి,మఖ,ఉత్తర,హస్త, చిత్ర,ధనిష్ఠ,శతభిషం,ఉత్తరాభాద్ర,రేవతి | అశ్వని,మఖ,ఉత్తర,హస్త,ధనిష్ఠ,శతభిషం, ఉత్తరాభాద్ర,రేవతి |
| **కృత్తిక** | అశ్వని,మఖ,ఉత్తర,హస్త,అనూరాధ,మూల, ఉత్తరాషాఢ,శ్రవణం,ధనిష్ఠ,శత,ఉ.భాద్ర,రేవతి | అశ్వని,పుష్యమి,మఖ,ఉత్తర,హస్త,చిత్ర,స్వాతి, శతభిషం,ఉత్తరాభాద్ర,రేవతి | అశ్వని,మఖ,ఉత్తర,హస్త,శతభిషం, ఉత్తరాభాద్ర,రేవతి |
| **రోహిణి** | అశ్వని,ఉత్తర,హస్త,చిత్ర,మూల,ఉత్తరాషాఢ, శ్రవణం,ధనిష్ఠ,శతభిషం,ఉత్తరాభాద్ర,రేవతి | అశ్వని,మఖ,ఉత్తర,హస్త,చిత్ర, స్వాతి,ఉత్తరాభాద్ర,రేవతి | అశ్వని,ఉత్తర,హస్త,చిత్ర, ఉత్తరాభాద్ర,రేవతి |
| **మృగశిర** | అశ్వని,రోహిణి,ఉత్తర,హస్త,చిత్ర,స్వాతి,మూల, ఉ.షాఢ,శ్రవణ,ధనిష్ఠ,శతభిషం,ఉ.భాద్ర,రేవతి | అశ్వని,రోహిణి,మఖ,ఉత్తర,హస్త,చిత్ర, స్వాతి,అనూరాధ,ఉత్తరాభాద్ర,రేవతి | అశ్వని,రోహిణి,ఉత్తర,హస్త,చిత్ర, స్వాతి,ఉ.భాద్ర,రేవతి |
| **ఆర్ద్ర** | అశ్వని,రోహిణి,మృగశిర,హస్త,చిత్ర,స్వాతి, ఉ.షాఢ,శ్రవ,ధనిష్ఠ,శతభిష,ఉత్తరాభాద్ర,రేవతి | అశ్వని,రోహిణి,మృగశిర,ఉత్తర,హస్త, చిత్ర,స్వాతి,అనూరాధ,రేవతి | అశ్వని,రోహిణి,మృగశిర,హస్త,చిత్ర, స్వాతి,రేవతి |
| **పునర్వసు** | అశ్వని,రోహిణి,మృగశిర,చిత్ర,స్వాతి,అనూరాధ, ఉ.షాఢ,శ్రవణ,ధనిష్ఠ,శతభిషం,ఉ.భాద్ర,రేవతి | అశ్వని,రోహిణి,మృగశిర,ఉత్తర, హస్త,చిత్ర,స్వాతి,అనూరాధ,మూల | అశ్వని,రోహిణి,మృగశిర,చిత్ర,స్వాతి,అనూరాధ |
| **పుష్యమి** | అశ్వని,రోహిణి,మృగశిర,పునర్వసు,స్వాతి, అనూరాధ,శ్రవణ,ధని,శతభిషం,ఉ.భాద్ర,రేవతి | రోహిణి,మృగశిర,పునర్వసు,హస్త, చిత్ర,స్వాతి,అనూరాధ,మూల | రోహిణి,మృగశిర,పునర్వసు, స్వాతి,అనూరాధ |
| **ఆశ్లేష** | అశ్వని,రోహిణి,మృగశిర,పునర్వసు,పుష్యమి అనూరాధ,మూల,శ్రవ,ధని,శత,ఉ.భాద్ర,రేవతి | రోహిణి,మృగశిర,పునర్వసు,పుష్యమి చిత్ర,స్వాతి,అనూరాధ,మూల,ఉత్తరాషాఢ | రోహిణి,మృగశిర,పునర్వసు,పుష్యమి అనూరాధ,మూల |

## గృహారంభ, గృహప్రవేశములకు వృషభచక్ర శుద్ధి, కలశచక్ర శుద్ధి పట్టిక

| రవి సంచార నక్షత్రము | వృషభచక్ర శుద్ధి నక్షత్రాలు | కలశచక్ర శుద్ధి నక్షత్రాలు | వృషభ, కలశచక్ర శుద్ధుల నక్షత్రాలు |
|---|---|---|---|
| మఘ | అశ్వని,రోహిణి,మృగశిర,పునర్వసు,పుష్యమి అనూరాధ,మూల,ధనిష్ఠ,శతభి,ఉ.భాద్ర,రేవతి | రోహిణి,మృగశిర,పునర్వసు,పుష్యమి స్వాతి,అనూరాధ,మూల,ఉత్తరాషాఢ,శ్రవణం | రోహిణి,మృగశిర,పునర్వసు,పుష్యమి అనూరాధ,మూల |
| పుబ్బ | అశ్వని,రోహిణి,మృగశిర,పునర్వసు,పుష్యమి,మఖ మూల,ఉత్తరాషాఢ,శతభిషం,ఉ.భాద్ర,రేవతి | మృగశిర,పునర్వసు,పుష్యమి,మఖ అనూరాధ,మూల,ఉత్తరాషాఢ,శ్రవణం,ధనిష్ఠ | మృగశిర,పునర్వసు,పుష్యమి,మఖ మూల,ఉత్తరాషాఢ |
| ఉత్తర | అశ్వని,రోహిణి,మృగశిర,పునర్వసు,పుష్యమి మఖ,మూల,ఉత్తరాషాఢ,ఉత్తరాభాద్ర,రేవతి | పునర్వసు,పుష్యమి,మఖ,అనూరాధ,మూల ఉత్తరాషాఢ,శ్రవణం,ధనిష్ఠ,శతభిషం | పునర్వసు,పుష్యమి,మఖ, మూల,ఉత్తరాషాఢ |
| హస్త | అశ్వని,రోహిణి,మృగశిర,పునర్వసు,పుష్యమి మఖ,ఉత్తర,ఉ.షాఢ,శ్రవణం,ఉ.భాద్ర,రేవతి | పునర్వసు,పుష్యమి,మఖ,ఉత్తర,మూల, ఉత్తరాషాఢ,శ్రవణం,ధనిష్ఠ,శతభిషం | పునర్వసు,పుష్యమి మఖ,ఉత్తర,ఉ.షాఢ,శ్రవణం |
| చిత్ర | అశ్వని,రోహిణి,మృగశిర,పునర్వసు,పుష్యమి మఖ,ఉత్తర,హస్త,ఉ.షాఢ,శ్రవణం,ధనిష్ఠ,రేవతి | పుష్యమి,మఖ,ఉత్తర,హస్త,మూల, ఉత్తరాషాఢ,శ్రవణం,ధనిష్ఠ,శతభిషం | పుష్యమి,మఖ,ఉత్తర, హస్త,ఉ.షాఢ,శ్రవణం,ధనిష్ఠ |
| స్వాతి | అశ్వని,రోహిణి,మృగశిర,పునర్వసు,పుష్యమి మఖ,ఉత్తర,హస్త,చిత్ర,శ్రవణం,ధనిష్ఠ,శతభిషం | మఖ,ఉత్తర,హస్త,చిత్ర,ఉత్తరాషాఢ శ్రవణం,ధనిష్ఠ,శతభిషం,ఉత్తరాభాద్ర,రేవతి | మఖ,ఉత్తర,హస్త,చిత్ర, శ్రవణం,ధనిష్ఠ,శతభిషం |
| విశాఖ | రోహిణి,మృగశిర,పునర్వసు,పుష్యమి,మఖ, ఉత్తర,హస్త,చిత్ర,స్వాతి,శ్రవణం,ధనిష్ఠ,శతభిషం | అశ్వని,మఖ,ఉత్తర,హస్త,చిత్ర,స్వాతి,ఉ.షాఢ, శ్రవణం,ధనిష్ఠ,శతభిషం,ఉ.భాద్ర,రేవతి | మఖ,ఉత్తర,హస్త,చిత్ర,స్వాతి, శ్రవణం,ధనిష్ఠ,శతభిషం |
| అనూరాధ | రోహిణి,మృగశిర,పునర్వసు,పుష్యమి,మఖ, ఉత్తర,హస్త,చిత్ర,స్వాతి,ధనిష్ఠ,శతభిషం,ఉ.భాద్ర | అశ్వని,ఉత్తర,హస్త,చిత్ర,స్వాతి,శ్రవణం, ధనిష్ఠ,శతభిషం,ఉత్తరాభాద్ర,రేవతి | ఉత్తర,హస్త,చిత్ర,స్వాతి, ధనిష్ఠ,శతభిషం,ఉ.భాద్ర |
| జ్యేష్ఠ | రోహిణి,మృగశిర,పునర్వ,పుష్య,మఖ,ఉత్త,హస్త చిత్ర,స్వాతి,అనూరాధ,శతభిషం,ఉ.భాద్ర,రేవతి | అశ్వని,ఉత్తర,హస్త,చిత్ర,స్వాతి,అనూరాధ, ధనిష్ఠ,శతభిషం,ఉత్తరాభాద్ర,రేవతి | ఉత్తర,హస్త,చిత్ర,స్వాతి,అనూరాధ, శతభిషం,ఉత్తరాభాద్ర,రేవతి |



## గృహారంభ, గృహప్రవేశములకు వృషభచక్ర శుద్ధి, కలశచక్ర శుద్ధి పట్టిక

| రవి సంచార నక్షత్రము | వృషభచక్ర శుద్ధి నక్షత్రాలు | కలశచక్ర శుద్ధి నక్షత్రాలు | వృషభ, కలశచక్ర శుద్ధుల నక్షత్రాలు |
|---|---|---|---|
| మూల | అశ్వని,మృగశిర,పునర్వసు,పుష్యమి,మఘు ఉత్తర,హస్త,చిత్ర,స్వాతి,అనూ,ఉ.భాద్ర,రేవతి | అశ్వని,రోహిణి,హస్త,చిత్ర,స్వాతి,అనూరాధ, శతభిషం,ఉత్తరాభాద్ర,రేవతి | అశ్వని,హస్త,చిత్ర,స్వాతి, అనూరాధ,ఉత్తరాభాద్ర,రేవతి |
| పూ.షాఢ | అశ్వని,పునర్వసు,పుష్యమి,మఘు,ఉత్తర,హస్త చిత్ర,స్వాతి,అనూరాధ,మూల,ఉ.భాద్ర,రేవతి | అశ్వని,రోహిణి,మృగశిర,చిత్ర,స్వాతి,అనూరాధ, మూల,ఉత్తరాభాద్ర,రేవతి | అశ్వని,చిత్ర,స్వాతి,అనూరాధ,మూల, ఉత్తరాభాద్ర,రేవతి |
| ఉ.షాఢ | అశ్వని,పునర్వసు,పుష్యమి,మఘు,ఉత్తర,హస్త చిత్ర,స్వాతి,అనూరాధ,మూల,రేవతి | అశ్వని,రోహిణి,మృగశిర,స్వాతి,అనూరాధ, మూల,ఉత్తరాభాద్ర,రేవతి | అశ్వని,స్వాతి,అనూరాధ, మూల,రేవతి |
| శ్రవణం | రోహిణి,మృగశిర,మఘు,ఉత్తర,హస్త, చిత్ర,స్వాతి,అనూరాధ,మూల,ఉత్తరాషాఢ | అశ్వని,రోహిణి,మృగశిర,పునర్వసు,అనూరాధ, మూల,ఉత్తరాషాఢ,రేవతి | రోహిణి,మృగశిర,అనూరాధ, మూల,ఉత్తరాషాఢ |
| ధనిష్ఠ | రోహిణి,మృగశిర,మఘు,ఉత్తర,హస్త,చిత్ర, స్వాతి,అనూరాధ,మూల,ఉత్తరాషాఢ,శ్రవణం | అశ్వని,రోహిణి,మృగశిర,పునర్వసు,పుష్యమి, అనూరాధ,మూల,ఉత్తరాషాఢ,శ్రవణం | రోహిణి,మృగశిర,అనూరాధ, మూల,ఉత్తరాషాఢ,శ్రవణం |
| శతభిషం | రోహిణి,మృగశిర,పునర్వ,ఉత్తర,హస్త,చిత్ర, స్వాతి,అనూరాధ,మూల,ఉ.షాఢ,శ్రవణం,ధనిష్ఠ | రోహిణి,మృగశిర,పునర్వసు,పుష్యమి, మూల,ఉత్తరాషాఢ,శ్రవణం,ధనిష్ఠ | రోహిణి,మృగశిర,పునర్వసు, మూల,ఉత్తరాషాఢ,శ్రవణం,ధనిష్ఠ |
| పూ.భాద్ర | మృగశిర,పునర్వసు,పుష్యమి,ఉత్తర,హస్త,చిత్ర, స్వాతి,అనూ,మూల,ఉ.షాఢ,శ్రవణం,ధని,శత | రోహిణి,మృగశిర,పునర్వసు,పుష్యమి,మఘు, మూల,ఉత్తరాషాఢ,శ్రవణం,ధనిష్ఠ,శతభిషం | మృగశిర,పునర్వసు,పుష్యమి, మూల,ఉత్తరాషాఢ,శ్రవణం,ధనిష్ఠ,శతభిషం |
| ఉ.భాద్ర | పునర్వసు,పుష్యమి,హస్త,చిత్ర,స్వాతి, అనూ,మూల,ఉ.షాఢ,శ్రవణం,ధని,శతభిషం | రోహిణి,మృగశిర,పునర్వసు,పుష్యమి,మఘు, మూల,ఉత్తరాషాఢ,శ్రవణం,ధనిష్ఠ,శతభిషం | మృగశిర,పుష్యమి,మూల, ఉత్తరాషాఢ,శ్రవణం,ధనిష్ఠ,శతభిషం |
| రేవతి | పునర్వసు,పుష్యమి,మఘు,చిత్ర,స్వాతి,అనూ,మూల, ఉ.షాఢ,శ్రవణం,ధని,శతభిషం,ఉత్తరాభాద్ర | మృగశిర,పునర్వసు,పుష్యమి,మఘు,ఉత్తర, ఉత్తరాషాఢ,శ్రవణం,ధనిష్ఠ,శతభిషం,ఉ.భాద్ర | పునర్వసు,పుష్యమి,మఘు, ఉత్తరాషాఢ,శ్రవణం,ధనిష్ఠ,శతభిషం,ఉ.భాద్ర |

## జన్మనక్షత్రవారీగా వివాహమునకు అనుకూల నక్షత్రాలు

| | | |
|---|---|---|
| **అశ్వని** | **భరణి** | **★ కృత్తిక 1వపాదం** |
| భరణి పుబ్బ పూర్వాషాఢ కృత్తిక ఉత్తర1(సింహం) ఉత్తరాషాఢ మృగశిర అశ్వని చిత్ర3,4 (తుల) ధనిష్ఠ ఆర్ద్ర స్వాతి శతభిషం పుష్యమి ఉత్తరాభాద్ర ఆశ్లేష రేవతి | కృత్తిక ఉత్తర1(సింహం) ఉత్తరాషాఢ రోహిణి శ్రవణం ఆర్ద్ర స్వాతి శతభిషం పునర్వసు విశాఖ 1,2,3 (తుల) పూర్వాభాద్ర ఆశ్లేష రేవతి అశ్వని మఖ మూల | రోహిణి శ్రవణం మృగశిర చిత్ర3,4 (తుల) ధనిష్ఠ పునర్వసు విశాఖ 1,2,3 (తుల) పూర్వాభాద్ర పుష్యమి ఉత్తరాభాద్ర అశ్వని మఖ మూల భరణి పుబ్బ పూర్వాషాఢ |
| **★ కృత్తిక 2,3,4 పాదాలు** | **రోహిణి** | **★ మృగశిర 1,2 పాదాలు** |
| రోహిణి హస్త శ్రవణం మృగశిర చిత్ర1,2 (కన్య) ధనిష్ఠ పునర్వసు విశాఖ4 (వృశ్చికం) పూర్వాభాద్ర పుబ్బ పుష్యమి అనూరాధ భరణి ఉత్తరాభాద్ర అశ్వని మఖ | మృగశిర చిత్ర1,2(తుల) ధనిష్ఠ ఆర్ద్ర శతభిషం కృత్తిక పుష్యమి అనూరాధ రోహిణి ఉ.భాద్ర రేవతి ఆశ్లేష జ్యేష్ఠ భరణి పుబ్బ ఉత్తర ఉత్తరాషాఢ 2,3,4 (మకరం) | ఆర్ద్ర శతభిషం పునర్వసు విశాఖ4 (వృశ్చికం) శ్రవణం పూర్వాభాద్ర ఆశ్లేష జ్యేష్ఠ రేవతి అశ్వని మఖ ఉత్తర కృత్తిక ఉత్తరాషాఢ2,3,4 (మకరం) రోహిణి హస్త |
| **★ మృగశిర 3,4 పాదాలు** | **ఆర్ద్ర** | **★ పునర్వసు 1,2,3 పాదాలు** |
| ఆర్ద్ర స్వాతి శతభిషం పునర్వసు విశాఖ1,2,3(తుల) పూర్వాభాద్ర ఆశ్లేష రేవతి అశ్వని మఖ మూల ఉత్తర కృత్తిక ఉత్తరాషాఢ1 (ధనస్సు) రోహిణి హస్త | పునర్వసు విశాఖ1,2,3(తుల) ఆర్ద్ర పూర్వాభాద్ర పుష్యమి ఉత్తరాభాద్ర అశ్వని మృగశిర మఖ మూల భరణి పుబ్బ హస్త పూర్వాషాఢ రోహిణి చిత్ర ధనిష్ఠ3,4 (కుంభం) | పుష్యమి ఉత్తరాభాద్ర ఆశ్లేష రేవతి భరణి పుబ్బ పూర్వాషాఢ కృత్తిక ఉత్తర ఉత్తరాషాఢ1 (ధనస్సు) చిత్ర మృగశిర ధనిష్ఠ3,4(కుంభం) ఆర్ద్ర స్వాతి శతభిషం |
| **★ పునర్వసు 4వ పాదం** | **పుష్యమి** | **ఆశ్లేష** |
| పుష్యమి అనూరాధ స్వాతి ఉత్తరాభాద్ర ఆశ్లేష జ్యేష్ఠ రేవతి భరణి పుబ్బ కృత్తిక ఉత్తర ఉత్తరాషాఢ2,3,4 (మకరం) మృగశిర చిత్ర ధనిష్ఠ1,2 (మకరం) ఆర్ద్ర | ఆశ్లేష జ్యేష్ఠ రేవతి అశ్వని మఘ కృత్తిక ఉత్తర పుష్యమి ఉత్తరాషాఢ 2,3,4 (మకరం) రోహిణి హస్త శ్రవణం ఆర్ద్ర స్వాతి పునర్వసు విశాఖ పూర్వాభాద్ర4 (మీనం) | మఘ అశ్వని భరణి పుబ్బ రోహిణి హస్త శ్రవణం చిత్ర పునర్వసు విశాఖ పుష్యమి పూర్వాభాద్ర4 (మీనం) మృగశిర ధనిష్ఠ1,2(మకరం) అనూరాధ ఉత్తరాభాద్ర |
| **మఘ** | **పుబ్బ** | **★ ఉత్తర 1వపాదం** |
| భరణి పుబ్బ పూర్వాషాఢ కృత్తిక ఉత్తర ఉత్తరాషాఢ1 (ధనస్సు) ఆర్ద్ర మృగశిర చిత్ర స్వాతి ధనిష్ఠ3,4 (కుంభం) శతభిషం పుష్యమి అనూరాధ ఆశ్లేష జ్యేష్ఠ | ఉత్తర కృత్తిక రోహిణి హస్త ఉత్తరాషాఢ1(ధనస్సు) శతభిషం ఆర్ద్ర స్వాతి అశ్వని పునర్వసు విశాఖ జ్యేష్ఠ పూర్వాభాద్ర1,2,3(కుంభం) మూల ఆశ్లేష మఘ పుబ్బ | హస్త రోహిణి మృగశిర చిత్ర ధనిష్ఠ3,4 (కుంభం) మూల పునర్వసు విశాఖ అశ్వని పుష్యమి పూర్వాభాద్ర1,2,3 (కుంభం) అనూరాధ మఖ భరణి పుబ్బ పూర్వాషాఢ |



## జన్మనక్షత్రవారీగా వివాహమునకు అనుకూల నక్షత్రాలు

| | | |
|---|---|---|
| **★ ఉత్తర 2,3,4 పాదాలు** | **హస్త** | **★ చిత్ర 1,2 పాదాలు** |
| హస్త రోహిణి శ్రవణం మృగశిర చిత్ర పునర్వసు ధనిష్ఠ1,2 (మకరం) విశాఖ పూర్వాభాద్ర4 (మీనం) పుబ్బ పుష్యమి అనూరాధ ఉత్తరాభాద్ర మఖ మూల పూర్వాషాఢ | మృగశిర చిత్ర ధనిష్ఠ1,2 (మకరం) ఆర్ద్ర స్వాతి హస్త పుష్యమి అనూరాధ రేవతి ఉత్తరభాద్ర ఆశ్లేష జ్యేష్ఠ పుబ్బ పూర్వాషాఢ ఉత్తర ఉ.షాఢ కృత్తిక2,3,4 (వృషభం) | స్వాతి ఆర్ద్ర విశాఖ పునర్వసు పూర్వాభాద్ర4 (మీనం) రేవతి ఆశ్లేష జ్యేష్ఠ మూల మఖ ఉత్తర ఉత్తరాషాఢ కృత్తిక2,3,4 (వృషభం) రోహిణి హస్త శ్రవణం చిత్ర |
| **★ చిత్ర 3,4 పాదాలు** | **స్వాతి** | **★ విశాఖ 1,2,3 పాదాలు** |
| స్వాతి ఆర్ద్ర శతభిషం పునర్వసు ఆశ్లేష విశాఖ పూర్వాభాద్ర1,2,3 (కుంభం) జ్యేష్ఠ అశ్వని మఖ మూల ఉత్తర ఉత్తరాషాఢ కృత్తిక1 (మేషం) హస్త శ్రవణం చిత్ర | విశాఖ పునర్వసు హస్త ధనిష్ఠ మృగశిర3,4 (మిథునం) పూర్వాభాద్ర1,2,3 (కుంభం) పుబ్బ అశ్వని పుష్యమి మఖ అనూరాధ శ్రవణం మూల పూర్వాషాఢ భరణి చిత్ర | పుష్యమి అనూరాధ ఆశ్లేష జ్యేష్ఠ భరణి పుబ్బ స్వాతి పూర్వాషాఢ కృత్తిక1 (మేషం) ఉత్తర ఉత్తరాషాఢ ధనిష్ఠ చిత్ర మృగశిర3,4 (మిథునం) శతభిషం ఆర్ద్ర |
| **★ విశాఖ 4వ పాదం** | **అనూరాధ** | **జ్యేష్ఠ** |
| అనూరాధ పుష్యమి రేవతి ఉత్తరాభాద్ర పుబ్బ ఆశ్లేష చిత్ర జ్యేష్ఠ పూర్వాషాఢ ఉత్తర స్వాతి విశాఖ ఉత్తరాషాఢ శతభిషం ధనిష్ఠ కృత్తిక2,3,4 (వృషభం) మృగశిర1,2 (వృషభం) | ఆశ్లేష జ్యేష్ఠ రేవతి మఖ మూల కృత్తిక2,3,4(వృషభం) స్వాతి ఉత్తర ఉత్తరాషాఢ రోహిణి హస్త విశాఖ శ్రవణం శతభిషం పూర్వాభాద్ర పునర్వసు (కర్కా) అనూరాధ | మూల మఖ పుబ్బ అనూరాధ పూర్వాషాఢ రోహిణి హస్త చిత్ర శ్రవణం మృగశిర1,2 (వృషభం) ధనిష్ఠ విశాఖ పుష్యమి పునర్వసు4 (కర్కాటకం) పూర్వాభాద్ర ఉత్తరాభాద్ర |
| **మూల** | **పూర్వాషాఢ** | **★ ఉత్తరాషాఢ 1వపాదం** |
| భరణి పుబ్బ పూర్వాషాఢ కృత్తిక1(మేషం) ఉత్తర చిత్ర ఉత్తరాషాఢ ధనిష్ఠ రేవతి మృగశిర3,4 (మిథునం) స్వాతి ఆర్ద్ర శతభిషం జ్యేష్ఠ ఉత్తరాభాద్ర అనూరాధ | ఉత్తరాషాఢ ఉత్తర అశ్వని కృత్తిక1 (వృషభం) శ్రవణం హస్త ఆర్ద్ర స్వాతి జ్యేష్ఠ మఖ శతభిషం పునర్వసు 1,2,3 (మిథునం) విశాఖ రేవతి మూల పూర్వాషాఢ పూర్వాభాద్ర | శ్రవణం హస్త చిత్ర భరణి మృగశిర3,4(మిథునం)ధనిష్ఠ పునర్వసు1,2,3(మిథునం) మఖ పుబ్బ విశాఖ పూర్వాభాద్ర మూల పూర్వాషాఢ అనూరాధ ఉ.భాద్ర అశ్వని ఉత్తరాషాఢ |
| **★ ఉత్తరాషాఢ 2,3,4 పాదాలు** | **శ్రవణం** | **★ ధనిష్ఠ 1,2 పాదాలు** |
| రోహిణి హస్త శ్రవణం చిత్ర ఉత్తరాషాఢ మృగశిర1,2 (వృష) ధనిష్ఠ పునర్వసు4 (కర్కా) విశాఖ మూల పూర్వాభాద్ర పుష్యమి అనూరాధ పూర్వాషాఢ ఉత్తరాభాద్ర అశ్వని భరణి | ధనిష్ఠ చిత్ర మృగశిర1,2 (వృషభం) కృత్తిక స్వాతి జ్యేష్ఠ శతభిషం పుష్యమి అనూరాధ ఉత్తరాభాద్ర రేవతి ఆశ్లేష భరణి పూర్వాషాఢ శ్రవణం ఉత్తర2,3,4 (కన్య) ఉత్తరాషాఢ | శతభిషం స్వాతి విశాఖ జ్యేష్ఠ పూర్వాభాద్ర పునర్వసు4 (కర్కాటకం) ఆశ్లేష రేవతి అశ్వని మూల కృత్తిక ఉత్తర 2,3,4 (కన్య) ఉత్తరాషాఢ రోహిణి హస్త శ్రవణం |

## జన్మనక్షత్రవారీగా వివాహమునకు అనుకూల నక్షత్రాలు

| ★ ధనిష్ఠ 3,4 పాదాలు | శతభిషం | ★ పూర్వాభాద్ర 1,2,3 పాదాలు |
|---|---|---|
| ఆర్ద్ర శతభిషం స్వాతి కృత్తిక పునర్వసు1,2,3 (మిధునం) విశాఖ పూర్వాభాద్ర జ్యేష్ఠ రేవతి అశ్వని మఖ మూల రోహిణి ఉత్తర1 (సింహం) ఉత్తరాషాఢ శ్రవణం | మూల పూర్వాభాద్ర విశాఖ పునర్వసు1,2,3(మిధునం) భరణి మృగశిర అనూరాధ పుబ్బ ఉత్తరాభాద్ర అశ్వని మఖ పూర్వాషాఢ ధనిష్ఠ శ్రవణం రోహిణి చిత్ర3,4 (తుల) | ఉత్తరాభాద్ర అనూరాధ రేవతి జ్యేష్ఠ పుబ్బ పూర్వాషాఢ భరణి కృత్తిక ఉత్తర1 స్వాతి (సింహం) ఉత్తరాషాఢ చిత్ర3,4 (తుల) ధనిష్ఠ మృగశిర ఆర్ద్ర శతభిషం |
| ★ పూర్వాభాద్ర 4వ పాదం | ఉత్తరాభాద్ర | రేవతి |
| ఉత్తరాభాద్ర పుష్యమి అనూరాధ ఆశ్లేష ఆర్ద్ర జ్యేష్ఠ రేవతి భరణి పూర్వాషాఢ కృత్తిక ఉత్తర2,3,4 చిత్ర 1,2 (కన్య) ఉత్తరాషాఢ మృగశిర శతభిషం ధనిష్ఠ | రేవతి ఆశ్లేష జ్యేష్ఠ మూల హస్త అశ్వని కృత్తిక ఆర్ద్ర ఉత్తర 2,3,4 (కన్య) ఉత్తరాషాఢ రోహిణి శ్రవణం శతభిషం పునర్వసు ఉత్తరాభాద్ర విశాఖ4(వృశ్చి) పూర్వాభాద్ర | అశ్వని మూల భరణి హస్త పూర్వాషాఢ రోహిణి శ్రవణం మృగశిర చిత్ర1,2 (కన్య) ధనిష్ఠ పునర్వసు విశాఖ4 (వృశ్చి) పూర్వాభాద్ర రేవతి పుష్యమి అనూరాధ ఉ.భాద్ర |

## వివాహ పొంతనలలో పాయింట్ల పట్టిక అశాస్త్రీయం

18 లేక అంతకంటే అధికంగా పాయింట్లు వస్తే వివాహమనుకూలమని, 18 కంటే తక్కువుంటే వివాహం చేయరాదని వధూవర గుణమేళన పట్టిక భావం. అనుభవంలో గమనిస్తే 18 పాయింట్ల కంటే అధికంగా వచ్చిననూ వివాహములు విచ్ఛిన్నమై, ద్వితీయ వివాహాలు జరిగినవి. 18 కంటే తగ్గిననూ సుఖసంతోషాలతో ఉంటూ షష్ఠి పూర్తి జరుపుకున్న దంపతులు కూడా ఉన్నారు. అనుభవంలో వధూవర గుణమేళన పట్టిక పూర్తి అశాస్త్రీయమని ఋజువైనది. వధూవర జాతకాలలో సంతాన కళత్ర ఆయుస్థానాధిపతుల మిత్రశతృత్వాలు, ఇతరములు పరిశీలించి వివాహ నిర్ణయాలను చేసుకోవాలి.

తారాబలంలో క్షేమతారను శుభకరమైననూ,ఇరువురికీ గమనిస్తే ఒకరినుంచి లెక్కిస్తే క్షేమతారాబలం, ఇంకొకరి నుంచి లెక్కిస్తే నైధన తారాబలముండును. మరి క్షేమతార శుభకరమని స్వీకరించాలా ? లేక నైధన తారాబలం ప్రమాదమని విసర్జించాలా ? అనుభవంలో పరిశీలిస్తే వివాహ పొంతన తారాబల నిర్ణయాలలో క్షేమతార, నైధనతారతో ఉన్న జంటలలో సమస్యలతో ఉన్న వారే అధికము. అతికొద్దిమందే సుఖశాంతులతో ఉన్నారు. ఇరువురి జాతకాలను వివాహ పొంతనకు లోతుగా పరిశీలించి, నిశ్చయ తాంబూలాదులను తీసుకొనేది.

వృషభ తులా లగ్నాలలో జన్మించిన వారికి వివాహస్థానాధిపతి కుజుడు. వీరికి కర్కాటక సింహలగ్న జాతకులను కాకుండా మిగిలిన లగ్న జాతకులు అనుకూలం. కర్కాటక సింహలగ్న జాతకులకు వివాహాధిపతి శని గనుక కుజ శనులిరువురు శతృవులయినందున విసర్జించాలి. అలాగే కర్కాటక సింహలగ్న జాతకులకు తులా వృషభ కుంభ లగ్నాలు అనుకూలం కాదు.

కృత్తిక మృగశిర పునర్వసు ఉత్తర చిత్ర విశాఖ ఉత్తరాషాఢలను ద్విరాశి నక్షత్రములు గల స్త్రీ పురుషులకు వివాహము చేయవచ్చును. ఉదాహరణకు కృత్తిక1 మేషరాశి వారు పురుషుడుగను, కృత్తిక 2,3,4 వృషభరాశిలో జన్మించిన స్త్రీ గాను ఉండాలి. అనగా మొదటిరాశి పురుషరాశిగను, రెండవరాశి స్త్రీరాశిగాను ఉన్నచో శుభదాయకమని భావము. పై విధంగా ఇతర గ్రహసంచారాలను కూడా గమనించి సశాస్త్రీయంగా వివాహ పొంతన చేయాలే తప్ప, పాయింట్ల పట్టికపై ఆధారపడవద్దు.



## ముఖ్యకార్య నిర్వహణకై మీ జన్మనక్షత్రాలకు అనుకూల తారాబలం కల్గిన నక్షత్రాలు

| | |
|---|---|
| అశ్వని | భరణి, రోహిణి, ఆర్ద్ర, పుష్యమి, ఆశ్లేష, పుబ్బ, హస్త, స్వాతి, అనూరాధ, జ్యేష్ఠ, పూర్వాషాఢ, శ్రవణం, శతభిషం, ఉత్తరాభాద్ర, రేవతి |
| భరణి | కృత్తిక మృగశిర పునర్వసు ఆశ్లేష మఘ ఉత్తర చిత్ర విశాఖ జ్యేష్ఠ మూల ఉత్తరాషాఢ ధనిష్ఠ పూర్వాభాద్ర రేవతి అశ్వని |
| కృత్తిక | రోహిణి ఆర్ద్ర పుష్యమి మఘ పుబ్బ హస్త స్వాతి అనూరాధ మూల పూర్వాషాఢ శ్రవణం శతభిషం ఉత్తరాభాద్ర అశ్వని భరణి |
| రోహిణి | మృగశిర పునర్వసు ఆశ్లేష పుబ్బ ఉత్తర చిత్ర విశాఖ జ్యేష్ఠ పూర్వాషాఢ ఉత్తరాషాఢ ధనిష్ఠ పూ.భాద్ర రేవతి భరణి కృత్తిక |
| మృగశిర | ఆర్ద్ర పుష్యమి మఘ ఉత్తర హస్త స్వాతి అనూరాధ మూల ఉత్తరాషాఢ శ్రవణం శతభిషం ఉత్తరాభాద్ర అశ్వని కృత్తిక రోహిణి |
| ఆర్ద్ర | పునర్వసు ఆశ్లేష పుబ్బ హస్త చిత్ర విశాఖ జ్యేష్ఠ పూర్వాషాఢ శ్రవణం ధనిష్ఠ పూర్వాభాద్ర రేవతి భరణి రోహిణి మృగశిర |
| పునర్వ | పుష్యమి మఘ ఉత్తర చిత్ర స్వాతి అనూరాధ మూల ఉత్తరాషాఢ ధనిష్ఠ శతభిషం ఉత్తరాభాద్ర అశ్వని కృత్తిక మృగశిర ఆర్ద్ర |
| పుష్యమి | ఆశ్లేష పుబ్బ హస్త స్వాతి విశాఖ జ్యేష్ఠ పూర్వాషాఢ శ్రవణం శతభిషం పూర్వాభాద్ర రేవతి భరణి రోహిణి ఆర్ద్ర పునర్వసు |
| ఆశ్లేష | మఘ ఉత్తర చిత్ర విశాఖ అనూరాధ మూల ఉత్తరాషాఢ ధనిష్ఠ పూర్వాభాద్ర ఉత్తరాభాద్ర కృత్తిక మృగశిర పునర్వసు పుష్యమి |
| మఖ | పుబ్బ హస్త స్వాతి అనూరాధ జ్యేష్ఠ పూర్వాషాఢ శ్రవణం శతభిషం ఉత్తరాభాద్ర రేవతి భరణి రోహిణి ఆర్ద్ర పుష్యమి ఆశ్లేష |
| పుబ్బ | ఉత్తర చిత్ర విశాఖ జ్యేష్ఠ మూల ఉత్తరాషాఢ ధనిష్ఠ పూర్వాభాద్ర రేవతి అశ్వని కృత్తిక మృగశిర పునర్వసు ఆశ్లేష మఘ |
| ఉత్తర | హస్త స్వాతి అనూరాధ మూల పూర్వాషాఢ శ్రవణం శతభిషం ఉత్తరాభాద్ర అశ్వని భరణి రోహిణి ఆర్ద్ర పుష్యమి మఘ పుబ్బ |
| హస్త | చిత్ర విశాఖ జ్యేష్ఠ పూర్వాషాఢ ఉత్తరాషాఢ ధనిష్ఠ పూర్వాభాద్ర రేవతి భరణి కృత్తిక మృగశిర పునర్వసు ఆశ్లేష పుబ్బ ఉత్తర |
| చిత్ర | స్వాతి అనూరాధ మూల ఉత్తరాషాఢ శ్రవణం శతభిషం ఉత్తరాభాద్ర అశ్వని కృత్తిక రోహిణి ఆర్ద్ర పుష్యమి మఘ ఉత్తర హస్త |
| స్వాతి | విశాఖ జ్యేష్ఠ పూర్వాషాఢ శ్రవణం ధనిష్ఠ పూర్వాభాద్ర రేవతి భరణి రోహిణి మృగశిర పునర్వసు ఆశ్లేష పుబ్బ హస్త చిత్ర |
| విశాఖ | అనూరాధ మూల ఉత్తరాషాఢ ధనిష్ఠ శతభిషం ఉత్తరాభాద్ర అశ్వని కృత్తిక మృగశిర ఆర్ద్ర పుష్యమి మఘ ఉత్తర చిత్ర స్వాతి |
| అనూ | జ్యేష్ఠ పూర్వాషాఢ శ్రవణం శతభిషం పూర్వాభాద్ర రేవతి భరణి రోహిణి ఆర్ద్ర పునర్వసు ఆశ్లేష పుబ్బ హస్త స్వాతి విశాఖ |
| జ్యేష్ఠ | మూల ఉత్తరాషాఢ ధనిష్ఠ పూర్వాభాద్ర ఉత్తరాభాద్ర అశ్వని కృత్తిక మృగశిర పునర్వసు పుష్యమి మఘ ఉత్తర చిత్ర విశాఖ అనూరాధ |

| | |
|---|---|
| మూల | పూర్వాషాఢ శ్రవణం శతభిషం ఉత్తరాభాద్ర రేవతి భరణి రోహిణి ఆర్ద్ర పుష్యమి ఆశ్లేష పుబ్బ హస్త స్వాతి అనూరాధ జ్యేష్ఠ |
| పూ.షా | ఉత్తరాషాఢ ధనిష్ఠ పూర్వాభాద్ర రేవతి అశ్వని కృత్తిక మృగశిర పునర్వసు ఆశ్లేష మఘ ఉత్తర చిత్ర విశాఖ జ్యేష్ఠ మూల |
| ఉ.షా | శ్రవణం శతభిషం ఉత్తరాభాద్ర అశ్వని భరణి రోహిణి ఆర్ద్ర పుష్యమి మఘ పుబ్బ హస్త స్వాతి అనూరాధ మూల పూర్వాషాఢ |
| శ్రవణం | ధనిష్ఠ పూర్వాభాద్ర రేవతి భరణి కృత్తిక మృగశిర పునర్వసు ఆశ్లేష పుబ్బ ఉత్తర చిత్ర విశాఖ జ్యేష్ఠ పూర్వాషాఢ ఉత్తరాషాఢ |
| ధనిష్ఠ | శతభిషం ఉత్తరాభాద్ర అశ్వని కృత్తిక రోహిణి ఆర్ద్ర పుష్యమి మఘ ఉత్తర హస్త స్వాతి అనూరాధ మూల ఉత్తరాషాఢ శ్రవణం |
| శతభిషం | పూర్వాభాద్ర రేవతి భరణి రోహిణి మృగశిర పునర్వసు ఆశ్లేష పుబ్బ హస్త చిత్ర విశాఖ జ్యేష్ఠ పూర్వాషాఢ శ్రవణం ధనిష్ఠ |
| పూ.భా. | ఉత్తరాభాద్ర అశ్వని కృత్తిక మృగశిర ఆర్ద్ర పుష్యమి మఘ ఉత్తర చిత్ర స్వాతి అనూరాధ మూల ఉత్తరాషాఢ ధనిష్ఠ శతభిషం |
| ఉ.భా. | రేవతి భరణి రోహిణి ఆర్ద్ర పునర్వసు ఆశ్లేష పుబ్బ హస్త స్వాతి విశాఖ జ్యేష్ఠ పూర్వాషాఢ శ్రవణం శతభిషం పూర్వాభాద్ర |
| రేవతి | అశ్వని కృత్తిక మృగశిర పునర్వసు పుష్యమి మఘ ఉత్తర చిత్ర విశాఖ అనూరాధ మూల ఉత్తరాషాఢ ధనిష్ఠ పూర్వాభాద్ర ఉత్తరాభాద్ర |

**విశేష శుభకార్యములకు వినియోగించే 18 నక్షత్రములు** – అశ్వని, రోహిణి, మృగశిర, పునర్వసు, పుష్యమి, మఘ, ఉత్తర, హస్త, చిత్ర, స్వాతి, అనూరాధ, మూల, ఉత్తరాషాఢ, శ్రవణం, ధనిష్ఠ, శతభిషం, ఉత్తరాభాద్ర, రేవతి

**సాధారణ కార్యములకు ఉపయోగించే 9 నక్షత్రములు** – భరణి, కృత్తిక, ఆర్ద్ర, ఆశ్లేష, పుబ్బ, విశాఖ, జ్యేష్ఠ, పూర్వాషాఢ, పూర్వాభాద్ర

## శుభతారాబలం ఉన్నప్పటికీ ద్వాదశరాశుల వారు విసర్జించాల్సిన అష్టమచంద్ర నక్షత్ర దోష సమయాలు

| | |
|---|---|
| మేషరాశి– విశాఖ 4వ పాదం నుంచి జ్యేష్ఠ నక్షత్ర చివరి వరకు | తులారాశి – కృత్తిక 2వ పాదం నుంచి మృగశిర 2వ పాదం చివరి వరకు |
| వృషభరాశి– మూల నుంచి ఉత్తరాషాఢ 1వ పాదం చివరి వరకు | వృశ్చికరాశి– మృగశిర 3వ పాదం నుంచి పునర్వసు 3వ పాదం వరకు |
| మిధునరాశి – ఉ.షాఢ 2వ పాదం నుంచి ధనిష్ఠ 2వ పాదం చివరికి | ధనస్సురాశి – పునర్వసు 4వ పాదంతో పాటు పుష్యమి, ఆశ్లేష నక్షత్రాలు |
| కర్కాటకరాశి – ధనిష్ఠ 3వ పాదం నుంచి పూర్వాభాద్ర 3వ పాదం వరకు | మకరరాశి – మఘ, పుబ్బలతో పాటు ఉత్తర 1వ పాదం వరకు |
| సింహరాశి – పూర్వాభాద్ర 4వ పాదం నుంచి రేవతి చివరి వరకు | కుంభరాశి – ఉత్తర 2వ పాదం నుంచి చిత్ర 2వ పాదం వరకు |
| కన్యారాశి – అశ్వని, భరణితో పాటు కృత్తిక 1వ పాదం చివరి వరకు | మీనరాశి – చిత్ర 3వ పాదం నుంచి విశాఖ 3వ పాదం వరకు |



## హోరా సమయములలో ఆచరించు కార్యములు

ప్రతిరోజు సూర్యోదయంతో ఆరోజుకు అధిపతైన గ్రహనామంతో ఆనాటి ప్రారంభ హోరా మొదలగును. ఆదివారం సూర్యోదయం కాగానే ఆదివారానికి అధిపతైన రవిచే ప్రారంభ హోరా మొదలగును. రవికి చేరువగా శుక్ర, బుధులు వరుసగా ఉండును. గురువు, శుక్రుడు, బుధుడు పూర్ణ చంద్రుడు శుభగ్రహాలు కనుక శుభఫలితాలను ఇస్తారు. క్షీణ చంద్రుడు, రవి, కుజ శని గ్రహాలు పాపులు కనుక ప్రతికూల ఫలితాలను ఇచ్చుదురు.

**1 రవి హోరా:** అధికారుల దర్శనార్ధం, రాజకీయ, ఉద్యోగ వ్యాపార ప్రయత్నాలు, వైద్య సంప్రదింపులు, క్రయవిక్రయములు, కోర్టు వ్యవహారములు, సాహస కార్యాలు, యుద్ధ విద్యాభ్యాసము, సన్మానము, అగ్రిమెంట్లు, రిజిస్ట్రేషన్లు, ముఖ్యచర్చలకు అనుకూలము.

**2 శుక్ర హోరా:** సకల శుభాదులకు, నూతన వాహన ప్రారంభాలకు, శుభతాంబూలాదులకు, తీర్థయాత్రలు చేయుటకు, సంగీత సాహిత్య నాట్యాభ్యాసములకు, పరిమళ ద్రవ్య, బంగారం వెండి, విలాసవస్తువుల కొనుగోలుకు, పెండ్లిచూపులకు, శుభరాజీ ప్రయత్నాలకు శుభకరము.

**3 బుధ హోరా:** వ్యాకరణ గణిత శిల్ప వాస్తు జ్యోతిష మంత్ర శాస్త్రాభ్యాసాలు, జాతక పరిశీలన, న్యాయ వ్యవహారాల పరిశీలన, సకల వ్రాతపనులు, వ్యాపార ప్రారంభములు, పరిశోధనలకు, సాంకేతిక సలహాలకు, రాయబారములకు శుభకరము.

**4 చంద్ర హోరా:** మృష్టాన్న భోజనములకు, సముద్ర ప్రయాణములకు, నూతన వస్త్రాభరణ ధారణకు, దేవతార్చనలకు, స్థలమార్పులకు, జలప్రయాణములకు, వ్యక్తిగత రాజీ ప్రయత్నాలకు, నూతన వంట సామాగ్రి, బియ్యం ముత్యాలు తెల్లని వస్త్రాలు కొనుగోలుకు, జల వ్యాపార ప్రారంభాలకు, వర్ష సమయంలో ఆచరించు ముఖ్య పనులకు, మాతృసేవకు శుభకరము.

**5 శని హోరా:** శుభసంబంధ వ్యవహారములకు అనుకూలము కాదు. మినుములు, ఇనుము, నువ్వులు, తైలము, యంత్ర పరికరముల కొనుగోలుకు, వ్యాపార ప్రారంభములకు, సేవకవృత్తి ప్రవేశములకు, పరామర్శలకు, వాహన మరమ్మత్తులకు శనిహోరా అనుకూలము.

**6 గురు హోరా:** ఆర్థిక విద్యా వివాహ సంతాన శుభచర్చాదులకు, వాహన గ్రంథ కొనుగోళ్లకు, సంస్కృత భాషాధ్యయమునకు, బ్యాంకు లావాదేవీలకు, నూతన వస్త్రాభరణ ధారణకు, తీర్థయాత్రలకు, డోలారోహణం, పండిత న్యాయకోవిద దర్శన సత్కారములకు గురు హోరా అనుకూలము.

**7 కుజ హోరా:** ఇది అనుకూలమైన హోరా కాదు. వ్యవసాయ, రియల్ ఎస్టేట్, ఎలక్ట్రికల్, అగ్ని సంబంధ కార్యాలు, సాహసకార్యములు, సైన్యములో చేరుటకు, రక్షణ శాఖవారిని సంప్రదించుటకు, సేవక వృత్తి ప్రవేశములకు, భూ సేకరణకు, గృహనిర్మాణ భూకొలతలు వేయుటకు, శస్త్రచికిత్స నిమిత్తమై వైద్యులతో చర్చించుటకు అనుకూలముగా ఉండును.

గురు శుక్ర బుధ హోరాలు శుభప్రదం. శు.పంచమి నుంచి బ.దశమి వరకు చంద్రహోరా శుభప్రదం. ప్రయాణాలలో హోరా ముఖ్యం. ప్రతికార్యమునకు హోరా వర్తించదు. శుభ హోరాలో వర్జ్య, దుర్ముహూర్తాలున్ననూ ఆటంకములు కావని శాస్త్రవచనం. సూర్యోదయ, సూర్యాస్తమయాల మార్పులను బట్టి హోరా సమయం మారును.

సంవత్సరమంతా హోరా సమయం ఒకేలా ఉండదు. ఆదివారం సూర్యోదయం ఉ6.42, సూర్యాస్తమయం సా5.30 అనుకుందాం. దినప్రమాణాన్ని 12చే భాగిస్తే 54ని॥లు. పై పట్టిక ప్రకారం సూర్యోదయానికి 54ని॥లు కలిపితే రవి హోరా, మరల 54 ని॥లు కలిపితే శుక్రహోరా. ఈవిధంగా హోరల వారీగా సమయాన్ని కలుపుతుంటే సూర్యాస్తమయం 5.30ని॥లు శనిహోరాతో ముగియును. రాత్రి హోరా కూడా పైవిధంగానే లెక్కించాలి.

## నిత్యం ప్రతిగంటను పాలించే గ్రహ కాలహోరా

| వరుస గంటలు | ఆది ప-రా | సోమ ప-రా | మంగళ ప- రా | బుధ ప-రా | గురు ప-రా | శుక్ర ప-రా | శని ప-రా |
|---|---|---|---|---|---|---|---|
| 6-7 | ర-గు | చం-శు | కు-శ | బు-ర | గు-చం | శు-కు | శ-బు |
| 7-8 | శు-కు | శ-బు | ర-గు | చం-శు | కు-శ | బు-ర | గు-చం |
| 8-9 | బు-ర | గు-చం | శు-కు | శ-బు | ర-గు | చం-శు | కు-శ |
| 9-10 | చం-శు | కు-శ | బు-ర | గు-చం | శ-కు | శ-బు | ర-గు |
| 10-11 | శ-బు | ర-గు | చం-శు | కు-శ | బు-ర | గు-చం | శు-కు |
| 11-12 | గు-చం | శు-కు | శ-బు | ర-గు | చం-శు | కు-శ | బు-ర |
| 12-1 | కు-శ | బు-ర | గు-చం | శు-కు | శ-బు | ర-గు | చం-శు |
| 1-2 | ర-గు | చం-శు | కు-శ | బు-ర | గు-చం | శు-కు | శ-బు |
| 2-3 | శు-కు | శ-బు | ర-గు | చం-శు | కు-శ | బు-ర | గు-చం |
| 3-4 | బు-ర | గు-చం | శు-కు | శ-బు | ర-గు | చం-శు | కు-శ |
| 4-5 | చం-శు | కు-శ | బు-ర | గు-చం | శు-కు | శ-బు | ర-గు |
| 5-6 | శ-బు | ర-గు | చం-శు | కు-శ | బు-ర | గు-చం | శు-కు |

## అపరాహ్ణ కాల పితృతిథి నిర్ణయ గణితము

అపరాహ్ణ కాల పితృతిథి 6 విధాలు. దినప్రమాణమును 1. ప్రాతఃకాలము 2. సంగవకాలము 3. మధ్యాహ్న కాలము 4. అపరాహ్ణకాలము 5. సాయాహ్నకాలములను 5 భాగాలుగా విభజించాలి.

| | |
|---|---|
| సూర్యోదయము : | 5-52-00 |
| ప్రాతఃకాలము: | +2.24.48 |
| ప్రాతఃకాలఅంత్యం | 8.16.48 |
| సంగవం | +2.24.48 |
| సంగవకాలఅంత్యం | 10.41.36 |
| మధ్యాహ్నం | +2.24.48 |
| మధ్యాహ్నకాలఅంత్యం | 13.05.24 |
| అపరాహ్ణం | +2.24.48 |
| అపరాహ్ణ అంత్యం | 15.30.12 |
| సాయహ్నం | +2.24.48 |
| సాయహ్నాఅంత్యం | 17.55.00 |
| **అనగా సూర్యాస్తమం** | **5.55.00** |

ఉదాహరణకు సూర్యోదయము 5గం॥52ని॥లు, సూర్యాస్తమయం 5గం॥56ని॥లు ఉన్నరోజున దినప్రమాణము 12గం॥ 04ని॥లు. అనగా 724 నిముషాలు. 5 భాగములు చేయగా ఒక్కో భాగమునకు 144 నిముషాల 48 సెకన్లు వచ్చును. అనగా ఒక్కో భాగానికి 2గం॥24ని॥48 సెకన్లు. ఒక్కో భాగము ఏవిధంగా గణించాలనో ప్రక్క గణితాన్ని గమనించి తెలుసుకొనవలసినది.

1. ఈరోజు అపరాహ్ణమున తిథి ఉండి, రేపు అపరాహ్ణమున తిథి లేకుంటే ఈరోజే ఆబ్దికము. 2. ఈరోజు అపరాహ్ణమున తిథి లేక రేపు అపరాహ్ణమున తిథి ఉంటే రేపే ఆబ్దికము. 3. ఈరోజు, రేపు అపరాహ్ణములలో తిథి పూర్తిగా ఉన్నచో రేపటి రోజునే ఆబ్దికము. 4. ఈరోజు, రేపు అపరాహ్ణములలో తిథి సమానముగా ఉన్నచో రేపే ఆబ్దికము. 5. రెండురోజుల అపరాహ్ణములలో తిథి హెచ్చు తగ్గులుగా ఉంటే, ఎక్కువ అపరాహ్ణ వ్యాప్తి కల్గిన తిథి ఉన్నరోజునే ఆబ్దికము. 6. రెండు రోజుల అపరాహ్ణకాలములో తిథి అసలు లేనప్పుడు, ఈరోజు సాయంత్రమందలి తొలి రెండు ఘుడియలలో తిథి ఉన్నయెడల ఈరోజే ఆబ్దికము. అంటే సాయాహ్నం ప్రారంభమైన 48 నిముషాలలో తిథి ఉంటే ఈరోజు ఆబ్దికము. అలాకాక 48 నిముషాలు దాటిన తర్వాత తిథి ఏర్పడితే రేపటిరోజున ఆబ్దికమని ధర్మసింధు మొదలైన ధర్మశాస్త్రాలు పేర్కొన్నవి.



## అశౌచ నిర్ణయ విశేషాంశములు

అశౌచమున్నవారు నిత్యనైమిత్తిక క్రతువులను చేయకూడదు. జనన మరణాదుల యందు రక్తసంబంధీకులకు అశౌచం ఏర్పడును. అశౌచమునే సూతకము, శావము అందురు. సూతకమనగా పురుడు, శావమనగా మైల.

అశౌచమున్నవారు ఏ కర్మలనూ చేయకూడదు. దైవసన్నిధులయందు ప్రవేశించకూడదు. భగవత్పూజకై పుష్పములు, పండ్లు, కొబ్బరికాయ మొదలైన వాటిని కొని తెచ్చుట కూడా పనికిరాదు. అశౌచము కలవారి ద్రవ్యము కూడా వాస్తవానికి నిషేధింపదగినదే, కానీ ప్రస్తుత రోజులలో ఇది అసాధ్యమైన విషయం.

అశౌచములో సంక్రమణ, అమావాస్య తర్పణములు చేయకూడదు. కానీ అశౌచ సమయములో గ్రహణాలు వచ్చినచో గ్రహణకాలమున చేయు స్నానమాత్ర చేతనే సద్యశుద్ధి (అప్పటివరకు శుద్ధి) అగును.

మృతాశౌచమును... సపిండులు, సమానోదకులు, సగోత్రులు, అసగోత్రులు అను నాల్గు విధముల వారున్నారు. సపిండులనగా జన్మించినవారికి లేక మరణించిన వారికి 7 తరములు దాటకుండా లోపు ఉన్నవారని అర్థము. వీరినే దశరాత్రజ్ఞాతులు అని పిలుచుదురు. సమానోదకులు అనగా జన్మించిన వారికి లేక మరణించిన వారికి 7 తరములు దాటి 14 తరములు దాటకుండా లోపునున్నవారు అని అర్థము. వీరికి త్రిరాత్రజ్ఞాతులు అని పేరు.

సగోత్రులనగా జన్మించిన వారికి లేక మరణించిన వారికి 14 తరములు దాటి 21 తరములు దాటకుండా లోపునున్నవారు అని అర్థము. వీరికి ఏకరాత్ర జ్ఞాతులని పేరు. 21 తరములు దాటిన జ్ఞాతులకు అశౌచముండదు. కానీ సగోత్రులే.

అసగోత్రులనగా జన్మించిన వారికి లేక మరణించిన వారికి గోత్రీకులు కాకుండా అన్య గోత్రీకులైన మాతామహుడు మాతామహి మేనమామ మేనత్త మేనల్లుడు మేనకోడలు అల్లుడు వివాహమైన కుమార్తె మొదలగువారు. వీరు కూడా అశౌచమును పట్టవలసినందున వీరిని అసగోత్రులు అందరు. సాధారణంగా వీరు మూడు రోజులు గానీ, ఒకటిన్నర రోజు గానీ, ఒకరోజు గానీ అశౌచమును పట్టవలసి ఉండును.

దశరాత్రాశౌచము అనగా 10రోజులు మైల పట్టుట అని భావము. దీనిని సపిండులు పట్టవలయును. త్రిరాత్రాశౌచము అనగా మూడురోజులు మైల పట్టుట అని అర్థము. దీనిని సమానోదకులు, అసగోత్రులలో కొందరు పట్టవలయును. పక్షిణి అనగా ఒకటిన్నర రోజు లేక 90 ఘుడియలు మైలపట్టుట అని అర్థము. ఏకరాత్రాశౌచము అనగా ఒకరోజు మైల పట్టుటని అర్థము. దీనిని సగోత్రులు పట్టవలయును. మొదటిరోజు గడిచినచో దీనిని పట్టనవసరం లేదు.

అతిక్రాంతాశౌచము అనగా గడిచిపోయినట్టి కాలమునకు గల అశౌచము అని అర్థము. అనగా అశౌచమును పట్టవలసిన కాలములో కొంతకానీ, పూర్తిగా గానీ గడిచిన తర్వాత అశౌచవార్త తెలిస్తే, ఆ గడిచిపోయిన కాలమునకు గల అశౌచమునకు అతిక్రాంతాశౌచమని పేరు. గడిచిన కాలానికి తిరిగి ప్రత్యేకంగా అశౌచమును పట్టనవసరం లేదు.

సన్నిపాతాశౌచము అనగా ఒక అశౌచమును పట్టుచుండుగా మరియొక అశౌచము వచ్చినచో దానికి సన్నిపాతాశౌచము అని పేరు. ఈ సన్నిపాతాశౌచము పురుడు, మైలలకే వర్తించును. రజస్వల విషయములో వర్తించదు.

గర్భధారణ మాసములు పూర్తిగా నిండక మధ్యలో 3,4 మాసములలో గర్భము పోతే స్రావము అని, 5,6 మాసములలో పోతే పాతము అని అంటారు. కనుక ఈ సమయాలలో పట్టు అశౌచములకు స్రావాశౌచము, పాతాశౌచము అంటారు. ఈ అశౌచములు గర్భము ధరించు స్త్రీకి మాత్రమే ఉండును.

జాతాశౌచం అనగా పురుడు అని అర్థము. వ్యక్తి మరణించినప్పుడు కల్గు అశౌచమును మృతాశౌచమందురు. స్త్రీ ఋతుమతైనప్పుడు ఆ స్త్రీకి మాత్రమే ఉండునది రజస్వలాశౌచము.

అలాగే ఓ స్త్రీ ప్రసవించిన తర్వాత పురుష శిశువైనచో 30 రోజులును, స్త్రీ శిశువైనచో 40 రోజులును పట్టెడి అశౌచము, ప్రసూత్యాశౌచము అని అర్థము. ఇవి ఆ స్త్రీకి తప్ప ఇతరులకు ఉండదు.

శవమును దహనసంస్కారము చేసినట్టి వారికి సంక్రమించెడి అశౌచమును శవదహాశౌచము. దహనమును కుమారుడు చేసినచో అతనికి, అతని భార్యకు, సోదరులకు వారి భార్యలకు, పన్నెండవరోజు సాయంత్రం వరకు ఈ అశౌచము లుండును. ఒకవేళ కొంతమంది దూరదేశములలో ఉండిపోయి సకాలమునకు రాలేకపోయినచో తమ్ముడు, జ్ఞాతి, దౌహిత్రుడు, అల్లుడు మొదలైన వారు దహన సంస్కారమును చేయవలసి ఉండును. ఆవిధంగా చేసినచో వారు మామూలుగా పదిరోజులును, దౌహిత్రుడు, అల్లుడు మొదలైన అన్యగోత్రీకులు చేసినచో మూడు రోజులు మాత్రమే అశౌచము పట్టవలయును. ఒకవేళ కర్మకాండ వరకు జ్ఞాతి, దౌహిత్రుడు, అల్లుడు మొదలైన వారు చేసినచో వారి భార్యలకు కూడా పన్నెండవ రోజు వరకు ఈ అశౌచము పట్టవలయును.

భర్త తాలుకూ కల్గు అశౌచములన్నియునూ వారి భార్యకు కూడా వర్తించును. కానీ భార్య తాలూకూ అశౌచములు భర్తకుండవు. వివిధములైన బాంధవ్యముల వారికి పాటించవలసిన అశౌచదినములు ప్రక్కపట్టికలో చూడండి.

**ముహూర్త నిర్ణయానికి పంచకరహితం ఓ పద్ధతిలో చేయండి. కాకుంటే మరో పద్ధతి చేయండి. అప్పుడు లేకుంటే ఇంకో పద్ధతి చూడండి. ఇలా పలు వెసులుబాట్లు కల్పించే పంచకరహిత పద్ధతి అశాస్త్రీయం. కనుక ముహూర్త నిర్ణయాలకు ఈ అశాస్త్రీయ పద్ధతిని మేము పాటించుటలేదు.**

## వివిధ బాంధవ్యముల వారికి మృతాశౌచ నిర్ణయ పట్టిక

| మరణించిన వారు | పురుషులకు | అవివాహిత స్త్రీ | వివాహిత స్త్రీ |
|---|---|---|---|
| తల్లి | 10 రోజులు | 10 రోజులు | 3 రోజులు |
| తండ్రి | 10 రోజులు | 10 రోజులు | 3 రోజులు |
| తండ్రికి తండ్రి (తాత) | 10 రోజులు | 10 రోజులు | 11/2 రోజు |
| తండ్రికి తల్లి (నానమ్మ) | 10 రోజులు | 10 రోజులు | 11/2 రోజు |
| పెదనాన్న/బాబాయి | 10 రోజులు | 10 రోజులు | స్నానమాత్రం |
| పెదనాన్న, బాబాయి భార్యలు | 10 రోజులు | 10 రోజులు | స్నానమాత్రం |
| తండ్రికి మేనత్త | 11/2 రోజు | 11/2 రోజు | స్నానమాత్రం |
| తండ్రికి మేనత్త కుమారులు | 11/2 రోజు | 11/2 రోజు | స్నానమాత్రం |
| తండ్రితండ్రికి సోదరులు | 10 రోజులు | 10 రోజులు | 11/2 రోజు |
| నానమ్మకు అక్కచెల్లెల్లు | 11/2 రోజు | 11/2 రోజు | లేదు |
| నానమ్మకు అన్నదమ్ములు | 11/2 రోజు | 11/2 రోజు | లేదు |
| నానమ్మ తోబుట్టువు బిడ్డలు | 11/2 రోజు | 11/2 రోజు | లేదు |
| తల్లికి మేనత్త | 11/2 రోజు | 11/2 రోజు | లేదు |
| తల్లికి మేనత్త కుమారులు | 11/2 రోజు | 11/2 రోజు | లేదు |
| తల్లికి మేనమామ | 11/2 రోజు | 11/2 రోజు | లేదు |
| తల్లికి మేనమామ కుమారులు | 11/2 రోజు | 11/2 రోజు | లేదు |



## వివిధ బాంధవ్యముల వారికి మృతాశౌచ నిర్ణయ పట్టిక

| మరణించిన వారు | పురుషులకు | అవివాహిత స్త్రీ | వివాహిత స్త్రీ |
|---|---|---|---|
| తల్లి తోబుట్టువులు | 11/2 రోజు | 11/2 రోజు | 11/2 రోజు |
| తల్లి తోబుట్టువుల కుమారులు | 11/2 రోజు | 11/2 రోజు | స్నానం |
| మేనత్త | 11/2 రోజు | 11/2 రోజు | స్నానం |
| మేనత్త కుమారులు | 11/2 రోజు | 11/2 రోజు | లేదు |
| మేనమామ | 11/2 రోజు | 11/2 రోజు | 11/2రోజు |
| మేనమామ కుమారులు | 11/2 రోజు | 11/2 రోజు | 11/2రోజు |
| సవితి మేనమామ | 11/2 రోజు | 11/2 రోజు | 1రోజు |
| అనుపనీత మేనమామ | 11/2 రోజు | 11/2 రోజు | 11/2రోజు |
| మేనమామ భార్య | 11/2 రోజు | 11/2 రోజు | 11/2రోజు |
| ఉపనీత మేనల్లుడు | 3రోజులు | 3 రోజులు | లేదు |
| సాపత్ని మేనల్లుడు | 3 రోజులు | 3 రోజులు | లేదు |
| అనుపనీత మేనల్లుడు | 11/2 రోజు | 11/2 రోజు | లేదు |
| మేనకోడలు | స్నానం | స్నానం | లేదు |
| తల్లికి తండ్రి (తాత) | 3 రోజులు | 3 రోజులు | 3 రోజులు |
| తల్లికి తల్లి (అమ్మమ్మ) | 3 రోజులు | 3 రోజులు | 3 రోజులు |
| అనుపనీత దౌహిత్రుడు | 11/2 రోజు | 11/2రోజు | 11/2రోజు |
| ఉపనీత దౌహిత్రుడు | 3 రోజులు | 3 రోజులు | స్నానం |

| మరణించిన వారు | పురుషులకు | అవివాహిత స్త్రీ | వివాహిత స్త్రీ |
|---|---|---|---|
| దౌహిత్రి | స్నానం | స్నానం | స్నానం |
| భార్య తల్లిదండ్రులు | 11/2 రోజు | - | - |
| స్వంత అల్లుడు | 1 రోజు | 1 రోజు | 1 రోజు |
| ఉపనీత భార్య సోదరుడు | 1 రోజు | - | - |
| అనుపనీత భార్య సోదరుడు | స్నానం | - | - |
| భార్యకు అక్కచెల్లెల్లు | స్నానం | - | - |
| అనుపనీత సోదరుడు | 3 రోజులు | 3 రోజులు | స్నానం |
| అవివాహిత మృతి | తండ్రికి 3రోజులు సపిండులకు 1రోజు | - | తల్లికి 3రోజులు |
| నిశ్చితార్థం తదుపరి అవివాహిత మృతి | తండ్రికి 3రోజులు కాబోయే భర్తకు 3 రోజులు | | తల్లికి 3రోజులు |
| వివాహిత కన్య పితృగృహ మందు మరణిస్తే | తండ్రికి 3 రోజులు సోదరులకు 3రో॥ సపిండులకు స్నానం | | తల్లికి 3రోజులు |
| వివాహిత కన్య అత్తవారింట మరణిస్తే | తండ్రికి11/2రోజు సోదరులకు 11/2 | | తల్లికి 11/2రోజు అక్కచెల్లెల్లకు 1రోజు |
| దత్తపుత్రుడు | జనకపిత 3రో॥ | | జనకమాత 3రో |

## త్రిజ్యేష్ఠ, జ్యేష్ఠా చతుష్టయం, జ్యేష్ఠా పంచకములు

జ్యేష్ఠులనగా తొలిచూలు పిల్లలని అర్థము. వధువు కంటే, వరుని కంటే ముందు ఒకరు లేక చాలామంది జన్మించి మరణించినచో ఆ మరణించిన వారిలో ప్రధములే జ్యేష్ఠులగుదురు. జీవించి ఉన్న వారిననుసరించి జ్యేష్ఠా నిర్ణయములు చేయరాదు. జన్మ క్రమం విడిచి స్త్రీ పురుషులలో జ్యేష్ఠా నిర్ణయము శాస్త్ర విరుద్ధము. జీవించి ఉన్ననూ, మరణించిననూ ప్రధమ గర్భమే జ్యేష్ఠులని భావము.

1. వధూవరులిరువురూ జ్యేష్ఠులై జ్యేష్ఠమాసములో వివాహం చేయటాన్ని త్రిజ్యేష్ఠ అంటారు. 2. వధూవరులలో ఒకరు జ్యేష్ఠులై, వారిలో ఒకరిది జ్యేష్ఠా నక్షత్రమై, జ్యేష్ఠంలో వివాహం త్రిజ్యేష్ఠే. 3. వధూవరులిరువురూ జ్యేష్ఠులు కాకున్ననూ, ఇరువురూ జ్యేష్ఠమాసంలో జన్మించి, జ్యేష్ఠమాసంలో వివాహం కూడా త్రిజ్యేష్ఠే. 4. వధూవరులిరువురూ జ్యేష్ఠులుగాకున్ననూ వారి జన్మనక్షత్రాలు జ్యేష్ఠలై జ్యేష్ఠమాసంలో వివాహం త్రిజ్యేష్ఠయే. 5. వధూవరిలురువురునూ జ్యేష్ఠులై వారిలో ఒకరిది జ్యేష్ఠానక్షత్రమై జ్యేష్ఠమాసంలో వివాహము జ్యేష్ఠా చతుష్టయమగును. 6. వధూవరులిరువురూ జ్యేష్ఠులై ఇరువురి నక్షత్రములు జ్యేష్ఠలై జ్యేష్ఠమాసంలో జరిగే వివాహాన్ని జ్యేష్ఠా పంచకమందురు. వివాహాలలో ఇవి నిషిద్ధము.

## అభ్యంగన స్నానము చేయవలసిన, చేయకూడని రోజులు

సూర్యసంక్రమణ, మాసశివరాత్రి రోజులలో, రాత్రి సమయాలలో, పితృకార్యములు ఆచరించే రోజులలో, ముఖ్య ప్రయాణ దినములందు, వ్రతదీక్షలు చేపట్టే రోజులందు, పాడ్యమి షష్ఠి అష్టమి ద్వాదశి చతుర్దశి పూర్ణిమ అమావాస్య తిథులందు, అశ్వని ఆర్ద్ర స్వాతి జ్యేష్ఠ శ్రవణానక్షత్ర రోజులలో, మంగళ గురువారాలలో, కృష్ణాష్టమి పర్వదినాన తలంటుకుని అభ్యంగనస్నానం చేయుట నిషిద్ధము.

వివాహాది శుభకార్యాలందు, సంక్రాంతి ముందురోజైన భోగి నాడు, కర్కాటక సంక్రమణ మరునాడు, ఉగాది, నరకచతుర్దశి స్వాతి నక్షత్రమందు, జాతాశౌచ మృతాశౌచ నివృత్తి రోజులలో, క్షురకర్మ అనంతరం అభ్యంగన స్నానాచరణ తప్పనిసరని శాస్త్రనిర్దేశము. ధనకాముకులగు వారు శుక్రవారం మధ్యాహ్నం తదుపరి అభ్యంగన స్నానము ఆచరించినచో విశేష శుభప్రదమని భావము.

## తిథి నక్షత్ర లగ్న సంధులలో దోష సమయములు

తిథులలో అమావాస్యకు శుక్ల పాడ్యమికి మధ్యలోను, పంచమి షష్ఠి మధ్యలోను, దశమి ఏకాదశి మధ్యలోను అలాగే నక్షత్రాలలో రేవతి అశ్వనులకు మధ్య, ఆశ్లేష మఘ మధ్యన, జ్యేష్ఠ మూల మధ్యన 4 ఘడియల కాలము నక్షత్ర సంధి దోషముండును. 4 ఘడియలు అనగా 1గంట 36నిముషాలు సంధి దోషముండును. అనగా అమావాస్య పంచమి దశమి రేవతి ఆశ్లేష జ్యేష్ఠ నక్షత్రాలకు అంత్యములో 48 నిముషాలు సంధిదోషముగా విసర్జించాలి. అలాగే శుక్ల పాడ్యమి షష్ఠి ఏకాదశి అశ్వని మఘ మూల నక్షత్రములకు కూడా ప్రారంభంలో 48 నిముషాలు సంధి దోషముగా వర్జించాలి.

అలాగే మీన మేష లగ్నాలకు నడుమ, కర్కాటక సింహ లగ్నాలకు మధ్యన, వృశ్చిక ధనుర్లగ్నములకు మధ్యన 24 నిముషాలు లగ్న సంధి దోషముండును. విశ్లేషిస్తే... మీన కర్కాటక వృశ్చిక లగ్నాలకు చివరలో 12 నిముషాలు, మేష, సింహ, ధనుర్లగ్నాలకు ప్రారంభంలో 12 నిముషాలు విసర్జించవలయును. కనుక పైన చెప్పిన సంధి దోషాలలో శుభకర కార్యాలను నిర్వహించుట శుభప్రదం కాదు.

## చవితి, అష్టమి, నవమి... దోషములా ?

పక్షఛిద్రములుగా పిలవబడే చవితి షష్ఠి అష్టమి నవమి ద్వాదశి చతుర్దశి తిథులనగానే భయపడతారు. ఈ తిథులలో శుభ కార్యములు ఆచరించరాదని విశ్వసిస్తుంటారు. ఇది పొరపాటు. గ్రహబలాబలాలను గ్రహించిన తదుపరే పంచాంగాలలో పండితులు ముహూర్తములను నిర్ణయిస్తారు.

చవితి ప్రారంభమైన 10 గంటల తదుపరి, షష్ఠి ప్రారంభమైన 2 గంటల తదుపరి, అష్టమి ద్వాదశి తిథులు ప్రారంభమైన 5గం॥36నిముషాల తదుపరి, నవమి చతుర్దశి తిథులు ప్రారంభమైన 4గం॥24నిముషాల తదుపరి శుభప్రద సమయమని శాస్త్ర నిర్దేశము. ఈ సమయానికి ముందున్న సమయము దోషమని భావం కాదు. శుభగ్రహాలైన గురువు, శుక్రుడు, బుధగ్రహ సంచార బలాబలాలచే దోషాలు ఉండవని శాస్త్ర నిర్దేశము.



## ద్వాదశ సంక్రమణ పుణ్యకాల వివరణ

జగద్రక్షకుడైన శ్రీ సూర్యభగవానుడు రాశియందు ప్రవేశించే సమయమును సంక్రమణం అని అందురు. ఈ సంక్రమణం ఒక్కోరాశిలో ఒక్కోపేరుతో పిలవబడుతూ, ఆ సంక్రమణ సమయానికి పూర్వము కొన్ని ఘడియలు, తదుపరి కొన్ని ఘడియలు పుణ్యకాలమని శాస్త్ర నిర్దేశము.

ఒక ఘడియ అనగా 24 నిముషాలు. 1. సూర్యుడు మేషరాశిలో ప్రవేశించే సమయాన్ని 'విషువము' అంటారు. సంక్రమణానికి పూర్వాపరాలు రెండింటిలోను 10 ఘడియలు పుణ్యకాలము. 2. వృషభ రాశి ప్రవేశాన్ని 'హరిపదము' అంటారు. పూర్వము 16 ఘడియలు పుణ్యకాలము. 3. మిధునరాశి ప్రవేశాన్ని 'షడశీతి' అంటారు. ఇది పరములో 16 ఘడియలు పుణ్యకాలము. 4. కర్కాటకరాశి ప్రవేశాన్ని 'అయనమని' పిలుచుదురు. పూర్వములో 30 ఘడియలు పుణ్యకాలము. 5. సింహరాశి ప్రవేశాన్ని 'హరిపదము' అంటారు. పూర్వములో 16 ఘడియలు పుణ్యకాలము. 6. కన్యారాశి ప్రవేశాన్ని 'షడశీతి' అందురు. పూర్వాపరాలు రెండింటిలోను 16 ఘడియలు పుణ్యకాలము.

7. తులారాశి ప్రవేశాన్ని 'విషువము' అంటారు. పూర్వాపరాలు రెండింటిలోను 10 ఘడియలు పుణ్యకాలము. 8. వృశ్చిక ప్రవేశాన్ని 'హరిపదము' అంటారు. పూర్వము 16 ఘడియలు పుణ్యకాలము. 9. ధనూరాశి ప్రవేశాన్ని 'షడశీతి' అందురు. పరములో మాత్రమే 16 ఘడియలు పుణ్యకాలము. 10. మకరరాశి ప్రవేశాన్ని 'అయనము' అంటారు. దీనినే ఉత్తరాయణ పుణ్యకాలము అంటారు. పరములో మాత్రమే 40 ఘడియలు పుణ్యకాలము. 11. కుంభరాశి ప్రవేశాన్ని 'హరిపద'మందురు. పూర్వములో 16 ఘడియలు పుణ్యకాలం. 12. మీనరాశి ప్రవేశాన్ని 'షడశీతి' అందురు. పరములో 16 ఘడియలు పుణ్యకాలం. ఈ సంక్రమణ పుణ్యకాల సమయాలలో పితృదేవతల తృప్తి పరిచి వారి ఆశీస్సులను పొందుటకై తర్పణ, పిండప్రదానాదులు ఆచరించాలి.

## వివాహాలలో ఏక నక్షత్ర నిర్ణయము

అశ్వని కృత్తిక రోహిణి మృగశిర ఆర్ద్ర పునర్వసు పుష్యమి మఘ పుబ్బ ఉత్తర హస్త చిత్ర విశాఖ అనూరాధ పూర్వాషాఢ ఉత్తరాషాఢ శ్రవణం ఉత్తరాభాద్ర రేవతి నక్షత్రములు స్త్రీ, పురుషులకు ఒకటైనచో వివాహాలలో శుభప్రదమే. పైన తెల్పిన కృత్తిక మృగశిర పునర్వసు ఉత్తర చిత్ర విశాఖ ఉత్తరాషాఢ నక్షత్రాలు రెండు రాశులకు సంబంధించినవే. ఈ రెండు రాశుల సంబంధం గల నక్షత్రములయందు స్త్రీ పురుషులు జన్మించినప్పుడు, వారిలో మొదటిది పురుషరాశి, తరువాత స్త్రీరాశి అయినచో మహా శుభప్రదమే. అలాకాక మొదటిది స్త్రీరాశిగాను, తర్వాతది పురుషరాశైనచో మధ్యమప్రదమే కానీ దోషము కాదు. వివాహ నిర్ణయాలలో నక్షత్ర నిర్ణయాలే కాక ఇతర గ్రహ సంచార స్థితిగతులన్నింటినీ విశ్లేషణ చేసి నిర్ణయించుకొనాలి.

## సైడీరియల్ టైమ్ అంటే ఏమిటి?

భూమి తన చుట్టూ తాను తిరగుటకై ఓరోజు పట్టును. భూమి సూర్యుని చుట్టూ తిరిగే వేగం స్థిరంగా ఉండక మార్పు జరుగుతూ ఉండును. సంవత్సరం మొత్తమునకు సరాసరిన 24 గంటలు ఉండును. దీనినే సరాసరి సౌరదినము అని వ్యవహరించుదురు. కానీ భూమి తన ఇరుసు మీద తిరగటానికి పట్టేకాలము ఖచ్చితంగా 23 గంటల 56 నిముషాలు ఉండును. దీనినే నాక్షత్రిక దినమని వ్యవహరిస్తారు. నక్షత్రాలలో పోల్చుకుంటే భూమి తన చుట్టూ తాను తిరగటానికి పట్టే సమయమే ఈ నాక్షత్రిక కాలము.

ఉదాహరణకు మధ్యాహ్నం 12 గంటలకు సూర్యుడు నడినెత్తి మీద ఉన్నప్పుడు, ఒక స్థానంలో నక్షత్రాన్ని చూశామనుకుంటే.. తర్వాత రోజున ఆ నక్షత్రాన్ని చూడటానికి 23గం॥56 నిముషాలు పడుతుంది. ఆ సమయానికి సూర్యుడు నడినెత్తి మీదకి రాడు. నక్షత్రాదులతో పోల్చిచూస్తే భూమి ఒక చుట్టు చుట్టినట్లే సూర్యునితో పోలిస్తే ఒక చుట్టు పూర్తి కాదు. సూర్యుడు నడినెత్తి మీదకి రావటానికి అధికంగా 4 నిముషాలు పట్టును. నక్షత్రదినం కంటే ఈ సౌరదినం 4 నిముషాలు పెద్దదని తెలియును. ఈ విధంగా జన్మసమయాన్ని నక్షత్ర సమయంలో సరిచేసినప్పుడు దానిని సైడీరియల్ టైమ్‌గా వ్యవహరిస్తారు. దీనిద్వారా లగ్న నిర్ణయం ఖచ్చితమైన ఫలితాలను ఇస్తుంది.

# UNITED STATES OF AMERICA (U.S.A)

## న్యూయార్క్ పంచాంగము

న్యూయార్క్ పంచాంగము, న్యూయార్క్‌కు మాత్రమే కాక
న్యూయార్క్ టైమ్‌జోన్‌లో ఉండే
క్రింది నగరాలకు కూడా వర్తించును.
న్యూయార్క్, అట్లాంటా, డెట్రాయిట్, వాషింగ్టన్ డి.సి, బోస్టన్, జెర్సీసిటీ, కేంబ్రిడ్జ్, మాంచెస్టర్, మేరీల్యాండ్ సిటీ, రోచెస్టర్, నాష్‌విల్లే, లూయిస్‌విల్లే, ఫిలడెల్ఫియా, పిట్స్‌బర్గ్, ఫ్రాంక్‌ఫర్ట్, క్లీవ్‌ల్యాండ్, రిచ్‌మండ్ (వర్జీనియా), పీటర్స్‌బర్గ్ (వర్జీనియా), జాక్సన్‌విల్లే (ఫ్లోరిడా), కొలంబస్ (ఒహాయో) న్యూయార్క్‌కు ఇచ్చిన శుభ సమయాలకు ఆది అంత్యాలలో 12 నిముషాలు తగ్గించినచో పైన పేర్కొన్న నగరాలకు శుభ సమయాలుగా వినియోగించుకోవచ్చును.

## కాలిఫోర్నియా టైమ్‌జోన్

లాస్‌ఏంజిల్స్, శాన్‌ఫ్రాన్సిస్‌కో, ఓక్‌ల్యాండ్, సియాటెల్, లాస్‌వేగాస్, వర్జీనియా సిటీ (నెవడా), ఒరెగాన్ సిటీ, శాన్‌జోస్, శాన్‌డీగో, స్ప్రింగ్‌ఫీల్డ్ (ఒరెగాన్), పోర్ట్‌ల్యాండ్ పైన పేర్కొన్న కాలిఫోర్నియా టైమ్‌జోన్‌లో ఉన్న నగరాలకు తిధి, నక్షత్రాల సమయాలకై, న్యూయార్క్ పంచాంగ సమయాలలో మూడు గంటలు తగ్గించుకొనేది.